

రాష్ట్ర స్థానిక పరిపాలనామంత్రి శ్రీ గోపాలరావు ఎక్బోటే సికింద్రాబాదు క్రొత్తమేయరును సలాంఛనంగా దుస్తులను ధరింపజేస్తున్నారు.

[దిగువ] గౌరవసూచకమైన మేయరు దుస్తులను సలాంఛనంగా ధరించిన తరువాత సికింద్రాబాద్ క్రొత్తమేయరు సేట్ ముకుంద్‌దాస్ మలానీ ప్రసంగిస్తున్నారు.



# విషయ సూచిక





ముఖచిత్రం :
హైదరాబాదు రాష్ట్రపతి నిలయంలో
రాష్ట్రపతి డా. రాజేంద్రప్రసాద్



వెనుకకవరు :
రాష్ట్రపతి నిలయాన్ని అలంకరించిన పనివారలకు విందు చేయబడిన సందర్భంలో రాష్ట్రపతి లంబాడీ స్త్రీలతోను, ఇతర పనివారలతోను కలిసి తేనీరు పుచ్చుకుంటున్న దృశ్యం.


హైదరాబాదు పౌరసంబంధముల శాఖచే ప్రచురింపబడి అజంతా ప్రింటర్సులో ముద్రింపబడినది.

# TOWARDS
# A
# WELFARE STATE



*Progress of the*

## FIRST
## FIVE-YEAR PLANE
*IN*
## HYDERABAD



PRICE: RS. 2-0-0

*Obtainable from:*

**THE DEPARTMENT OF INFORMATION & PUBLIC RELATIONS,**
**HYDERABAD. I (Dn)**

# ★ హైదరాబాదులో రాష్ట్రపతి ★

భారత అధ్యక్షులు డా. రాజేంద్రప్రసాద్ హైదరాబాదులో 1956 జూన్ 23 వ తేదీ మొదలు జులై 9 వ తేదీవరకు పక్షం రోజులపాటు సకుటుంబంగా చారిత్రక స్థలాలను సందర్శిస్తూ ముఖ్యమైన సభలు, సమావేశాలలో పాల్గొంటూ ఉల్లాసంగా గడిపారు. ఆయన వెళ్ళిన ప్రతిచోటా ప్రజలందరికీ దర్శనమిస్తూ, సామాన్యులతో సహితం ఆప్యాయంగా మాట్లాడుతూ, పౌరుల కార్యకలాపాలను, కృషినిచూచి తమ ప్రశంసలు తెలుపుతూ నిజంగా ప్రజాధ్యక్షు డని అనిపించుకున్నారు.

రాష్ట్రపతి బీదరు, ఔరంగాబాదు బహిరంగసభలలో ప్రసంగించిన సందర్భంలో రాజకీయ సమస్యలను ప్రస్తావిస్తూ ప్రజలు సరిహద్దుల మార్పులవల్ల కలత జెందక, భారతీయ సమైక్య తను కాపాడుకోవలసిందని ప్రబోధించినప్పుడు అచట గుమిగూడిన ప్రజాసమూహం కరతాళ ధ్వనులతో ఆయన చెప్పిన హితవును స్వీకరించింది. అట్లే హిందీభాష ప్రచారం జరుపడ మంటే ప్రాంతీయ భాషలపై దురాక్రమణగా భావించరాదనీ, అట్టి దురాక్రమణ ఎన్నటికీ జరుగదనీ హైదరాబాదు నగరంలో జరిగిన ఒక సభలో ఆయన చెప్పినపుడు అందరు అట్టి ప్రకటనకు తమ హర్షామోదాలు వెలిబుచ్చారు.

ఒక ప్రత్యేక రైలులో రాష్ట్రపతి సికింద్రాబాదు స్టేషనుకు రాగానే రాజప్రముఖ్, ముఖ్యమంత్రి, ఇతర మంత్రులు, ప్రముఖ వ్యక్తులు ఆయనకు స్వాగతం చెప్పారు. సెకండ్ గార్డ్సు యూనిటు సమర్పించిన గౌరవ వందనాన్ని స్వీకరించి ఆయన బొలారంలోని రాష్ట్రపతి నిలయానికి వెళ్ళారు. దారికిరుప్రక్కలా ప్రజలు బారులుగా నిల్చొని రాష్ట్రపతికి సుస్వాగత మిచ్చారు.

రాష్ట్రపతి కొద్దిరోజులపాటు మనోరంజకమైన దృశ్యములు చూస్తూ మర్యాదరీత్యా అవసరమైన సందర్శనలు చేస్తూ గడిపారు.

రాష్ట్రపతి తమ కుటుంబంవారితో పాటు 1956 జూన్ 30వ తేదీన చరిత్రాత్మకమైన బీదరు పట్టణాన్ని సందర్శించినపుడు ఆ పట్టణములోని 31వేల పైచిలుకు మంది ప్రజలు, ఇంకా పరిసరగ్రామాల ప్రజలు పట్టణ వీధులలో బారులు తీర్చి నిల్చొని ఆయనకు స్వాగత మిచ్చి, ఆయన దర్శనం చేసుకున్నారు.

ఆనాడు రాష్ట్రపతి ఒక ప్రత్యేక రైలులో ఉదయం 10-30 గం. లకు బీదరు విచ్చేసి, అక్కడ బహమనీ, బరీద్‌షాహీ రాజుల చరిత్ర ప్రసిద్ధమైన కట్టడములను పరిశీలిస్తూ, బీదరు ప్రకృతి సౌందర్యాన్ని తిలకిస్తూ ఆరున్నర గంటలు గడపి, తరువాత బొలారం తిరిగి వచ్చారు.

బహమనీ రాజులు బీదరు కోటను నిర్మించడానికి ఈస్థలాన్నే ఎందుకు నిర్ణయించారన్న ప్రశ్నకు చరిత్ర కారులు వివిధ కారణాలను చూపుతారు. ఇక్కడి శీతోష్ణ స్థితి మంచిది. వేసవిలో ఎండలు అంతగా వుండవు. కనుక రాజధానికి ఇది ఎన్నో విధాల తగి



*బీదర్ లో అతిథిగృహంలో ఏర్పాటుచేయబడిన స్వాగతసభలో రాష్ట్రపతి ప్రసంగిస్తున్నారు.*

వున్నది. మరొక కారణమేమంటే అప్పుడు బహమనీ రాజులకు కేంద్రంగా ఉన్నటువంటి గుల్బర్గా విజయ నగర సామ్రాజ్యానికి మరీ సమీపంలో వున్నది. అందుచేత తమ రాజధానీ నగరానికి తగు రక్షణ, భద్రత ఉండాలంటే బీదరుకు మారడం అవసరమని వారు భా౦ంచారు.

కారణా లేమైనప్పటికీ ఈ స్థలాన్ని వారు తగు జాగ్రత్తతోనే ఎన్నిక చేసినారు. బీదరుకోట, పట్టణం ఉన్నతమైన ప్రదేశంలో ఉన్నవి. ఆ ప్రదేశానికి దిగువన చుట్టూ సారవంతమైన లోయవున్నది. ఆలోయలో వ్యవసాయము జరుగుతుంది. ఈ విధంగా ఈ కోట కొండపై కట్టబడక పోయినప్పటికీ, ఎత్తయిన స్థలంలో నిర్మింప బడడంచేత కొండపై కట్టినట్లుగానే కన్పిస్తుంది. ఈ ప్రదేశం లోతైన డొంకలతో చూడడానికి కడు గంభీరంగా కన్పిస్తూ దుర్గ నిర్మాతల దూర దృష్టిని వ్యక్తం చేస్తుంది.

ఇచటి చారిత్రక కట్టడములే ఈ స్థలమునకు ఒక మహత్వాన్ని కల్పించాయి. అయితే ఆధునిక భవనములు ఎక్కువగాలేవు. ప్రజలు నివసించే ఇండ్లలో చాలభాగం అంతబాగా ఉండవు. ఇండ్ల గోడలు స్థానికంగా లభించే రాతితో నిర్మింప బడినవి. ఈ రాయి అంత గట్టిదికాదు. ఒకవైపు ఆధునిక రవాణాల కొరకు నిర్మింపబడినట్టి రోడ్లను, మరొకవైపు పాత తరహా నిర్మాణాలను, బురదతోనిండిన వీధులను, మురికి పేటలను చూస్తే పాత కొత్తలకు గల వ్యత్యాసం వ్యక్తమవుతుంది. అయితే అక్కడక్కడా కొన్ని ఉద్యానవనములు, సామాజికాభివృద్ధి బ్లాకు కార్యకలాపాల సందర్భంగా కొత్తగా నెలకొల్పబడుతున్న

అభివృద్ధి కేంద్రాలవల్ల పట్టణం అభివృద్ధిచెందుతున్న సూచనలు కల్పిస్తాయి. ఈ సామాజికాభివృద్ధి కార్య కలాపాలు ఇప్పుడు గ్రామప్రాంతాలలోనే అమలు జరుపబడుతున్నాయి. వాటిని పట్టణ ప్రాంతాలకు వ్యాపింపజేయవలసిన ఆవశ్యకత ఆ ప్రాంతాన్ని చూస్తే విశదమవుతుంది.

## దర్గా

రాష్ట్రపతి మొదట హజరత్‌షాహ అబుల్ ఫైజ్ దర్గాను సందర్శించారు. ఇది చాలా పెద్ద నిర్మాణం. దీనిలోపల ఆ మహర్షి గోరీ కలదు. దర్గా ఆవరణలో చల్లని నీడ నిచ్చే చెట్లవరుసలు కలవు. ఆ మహర్షి 1408 లో జన్మించి 1474 లో కాలధర్మం చెందాడు. ఈయన హజ్రత్ ఖాజా బందే నవాజ్ మనుమడు. ఖాజా బందే నవాజ్ దర్గా గుల్బర్గాలో ఉన్నది. హజ్రత్ షాహ అబుల్‌ఫైజ్ బహమనీరాజు అహ్మద్‌షాకు, ఆయన తరువాత రాజ్యమునకు వచ్చిన మరి ముగ్గురు రాజులకు సమకాలికుడు. ఈయన మూడవ మహమ్మదుషా కాలంలో పరలోకగతుడైనాడు. బహుశా మూడవ మహమ్మదుషాయే ఆ గోరీని నిర్మించి ఉండవచ్చు.

బహమనీరాజుల నిర్మాణశైలికి ఈ దర్గా ఒక నిదర్శనం. బయటిభాగమున చిత్రమైన పెంకులతో అలంకారంగా తాపడపు పని చేయబడివున్నది. బీదరులోని ఇతర చారిత్రక కట్టడములలో కూడా ఇట్టి అలంకరణపు పని కన్పిస్తుంది.

దర్గా పెద్దలు రాష్ట్రపతికి సంప్రదాయకమైన తలపాగా, ఇమామె జామిన్ సమర్పించారు. రాష్ట్రపతి దర్గా నంతటినీ పరిశీలించి, దాని చారిత్రక ప్రాముఖ్యమును అచటివారు వివరించి చెప్పగా అరగంటకు పైగా సావధానంగా విన్నారు. దర్గా నిర్మాణమునకు ఉపయోగించబడిన సామగ్రిని, దర్గా నిర్మాణకౌశల



*బీదర్‌లోని హజ్రత్ షాహ అబుల్ ఫైజ్ దర్గావద్ద రాష్ట్రపతి కుటుంబంవారు.*



*బీదర్‌లోని హజ్రత్ షాహ అబుల్ ఫైజ్ దర్గాలో రాష్ట్రపతి.*

మును మున్నగు వివరముల నన్నిటినీ ఆయన కడు శ్రద్ధ వహించి తెలుసుకున్నారు. రాష్ట్రపతి దర్గాకు రూ. 400 లు, గుల్బర్గా ఉరుసుకు రూ. 500 లు నగదు బహూకరించారు.

బీదరులో మరొక చిత్రమైన సంఘటన జరిగింది. అక్కడ రాష్ట్రపతి వద్దనుంచి నగదు బహుమతి పొందినవారిలో మేలూ ఒకడు. ఈతడు పాదరక్షలు తయారుచేయడంలో బహునేర్పరి. రాష్ట్రపతికి ఇతడు 3 తులాలు మాత్రమే బరువుగల పాదరక్షలను సమర్పించుకున్నాడు. రాష్ట్రపతి ఇతడి పనితనమును మెచ్చుకొని మరి పన్నెండు జతలకు ఆర్డరు ఇచ్చినారు.

## మదర్సా

రాష్ట్రపతి బీదరులోని మహమూదు గావాఁ పాఠశాల సందర్శించారు. ఇది ఒక ప్రాచ్యకళాశాల. దీనిని 1472 లో మహమూద్‌షాకు మంత్రియైన మహమూద్ గావాఁ నిర్మించాడు. రాష్ట్రపతి దీనిని దర్శించినప్పుడు అక్కడ వారికి అనేక ప్రాచీన నాణెములు, ప్రాచ్యలిఖిత పుస్తకములు చూపెట్టబడినవి. వాటిని ఉత్సాహవంతుడైన ఒకవ్యక్తి సేకరించి ప్రదర్శించాడు. ఈ పాఠశాల అరబ్బీ, పారసీ తదితర ప్రాచ్య విద్యలకు కేంద్రంగా ఉండేది. దీని నిర్మాణశైలి పారసీక రీతిలో ఉన్నది. పారసీకదేశంలో కూడా ఇటువంటిదే ఒక కళాశాల కలదు. బహుశా ఇది దాని ననుకరించియే నిర్మింపబడి ఉండవచ్చు. ఇందులో 96 గదులు కలవు. ఇది విద్వాంసులకూ, విద్యార్థులకూ నివాసం కూడా కలుగజేసిన సంస్థ. దీనిలో దాదాపు నూర్గురు విద్యార్థులకు వసతివుండేది. ఆ కాలంలో ఈ కళాశాలకు మంచి గ్రంథ భండారం కూడా ఉండేది. అందులో 3000 లిఖిత గ్రంథము

లుండేవి. భవనపార్శ్వములలో కళాశాల ఆచార్యుల గదులుకలవు. బీదరు రాజులు షియాతెగకు చెందిన వారు. అదేకాలంలో ఉత్తర భారతంలోని రాజులు సున్నీ తెగకు చెందినట్టివారు. అందుచేతనే బీదరు రాజులు కట్టించిన భవనములలో పారసీక నిర్మాణ ప్రభావం కన్పిస్తుంది. కనుకనే ఉత్తర భారతంలోని భవనములకూ, బీదరు భవనములకూ చాలా వ్యత్యాసం కన్పిస్తుంది.

ఈ కళాశాలభవనం పరచినట్లుగా నిర్మింపబడినదనీ దీనిలో కళా కౌశలం ఏమీలేదనీ కొందరు పాశ్చాత్య విమర్శకులన్నారు. కాని ప్రాచ్యనిర్మాణ రీతులదృష్ట్యా చూచినట్లయితే ఇది ఉత్తమమైన కట్టడములలో ఒకటని తెలియగలదు.

ఈ భవనం యొక్క ఎడమభాగం దెబ్బతిన్నది. దాదాపు ఒక శతాబ్దం క్రిందట పిడుగుపడడంవల్ల ఇది పడిపోయివుంటుందని కొందరంటారు. కాదు, ఆ భాగంలో తుపాకీ మందుగుండు సామగ్రి నిలువ చేయబడినదనీ, అది ప్రేలినందువల్ల ఆ భాగం దెబ్బ తిన్నదనీ మరొక గాథ కలదు.

రాష్ట్రపతి బీదరీ సామగ్రిని కూడా చూచారు. ఇది బీదరుకు ఒక ప్రత్యేకతను కల్పించినది. ఈ సామగ్రి పెద్ద బజారులోని ఒక దుకాణములో ప్రదర్శింపబడి నవి. ఈ సామగ్రిని తయారుచేయు విధానమును అక్కడివారు వివరించి చెప్పగా రాష్ట్రపతి కడుశ్రద్ధగా విన్నారు.

## బీదరు కోట

రాష్ట్రపతి బీదరు కోటచుట్టూ కారులో తిరిగి చూచారు. ఈ కోటకు అనేక బలీయమైన ప్రాకార ములు కలవు. రాష్ట్రపతి రంగీన్‌మహల్ కూడా చూచారు. దీనిలో నల్లబసాలత్ రాయిపై ప్రాచీన శిలాలేఖనములు, ముత్యపు చిప్పలతో తాపడపు పని



*బీదరులోని చరిత్రాత్మకమైన మహమూద్ గావాఁ పాఠశాలను రాష్ట్రపతి సందర్శించారు.*



*బీదరు కోటను వీక్షిస్తున్న రాష్ట్రపతి.*

కలదు. రాష్ట్రపతి "సోలాఖంబ్ మసీదు" అంటే పదహారు స్తంభముల మసీదును కూడా చూచారు. ఇది ఈ ప్రాంతములో కెల్లా అతి ప్రాచీనమైన మసీదు. ఆ తరువాత అనేక బహమనీరాజుల, బరీద్‌షాహీరాజుల పట్టాభిషేకములను చూచినట్టి తఖ్తు మహల్‌ను వీక్షించారు.

బీదరు కోటను అహమద్‌షా వలీ నిర్మించాడు. ఈ కోట నిర్మాణం 1432 లో పూర్తిచేయబడి నప్పటికీ గుల్బర్గానుంచి బీదరుకు రాజధాని ముందు గానే మార్చబడింది.

అన్నిటికంటె చివరన రాష్ట్రపతి చూచిన చారిత్రక స్థలం అలీ బరీద్‌గోరీ. దీనిపై కూడా మంచి అలంకారపు పని చేయబడివున్నది. బరీద్‌షాహీ రెండవ వంశపురాజులలో అలీ బరీద్ ఒకడు. ఇతడు 1579లో మరణించాడు.

అతిథి గృహంవద్ద రాష్ట్రపతి పౌరుల నుద్దేశించి ప్రసంగిస్తూ రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ ఫలితంగా ఎటువంటి మార్పులు వచ్చినప్పటికీ భారతీయులంతా ఐకమత్యంతో, సోదరభావంతో వ్యవహరించవలెనని ఉద్బోధించారు. రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ వ్యవహారాన్ని ప్రజలు సాధారణ విషయమని అనుకోవాలి. ఒక ప్రాంతం ఆ రాష్ట్రానికి పోయినా లేక ఈ రాష్ట్రంలో వున్నా ఒకరు సంతోషించడం, మరొకరు విచార పడడం మంచిదికాదు. ఎందుచేతనంటే ఏది ఎందులో వున్నా అంతా భారతదేశంలోనే వుంటుందిగాని ఎక్కడికీ పోవడంలేదు అని రాష్ట్రపతి హితవు చెప్పారు.

బీదరుజిల్లా బహు భాషలవారు నివసించే ప్రాంతం. హైదరాబాదు రాష్ట్రం విభజింపబడుతున్నట్లుగానే ఈ జిల్లా కూడా ఇప్పుడు విభజింపబడుతున్నది. కర్నాటకంలో ఉన్నా, ఆంధ్రలోవున్నా లేక మరే



ఔరంగాబాదులోని బీబీ కా మక్బరావద్ద రాష్ట్రపతి.



*ఔరంగాబాదులోని హిమ్రూ ఫ్యాక్టరీవద్ద రాష్ట్రపతికి స్వాగతం చెప్పబడింది.*

ఇతర రాష్ట్రంలోవున్నా అంతా మొదట భారతీయులు. రాష్ట్రాల సరిహద్దుల మార్పులవల్ల ప్రజల జీవితాలు తారుమారుకావడం లేదు. అభివృద్ధి పథకాలను అమలు పరచడంలో ప్రభుత్వంతోను, ఇతర నిర్మాణవ్యవస్థల తోను సహకరించవలసిందిగా రాష్ట్రపతి ప్రజలకు విజ్ఞప్తిచేశారు. ఆ తరువాత వారు బీదరునుంచి బయలుదేరి వెళ్ళారు.

## పనివారలకు విందు

రాష్ట్రపతి నిలయాన్ని అలంకరించుటలో తోడ్పడిన పనివారలకు, కళాకారులకు రాష్ట్రపతి జులై 1 వ తేదీన విందుచేశారు.

ఈ విందునకు వచ్చిన అతిథులలో హిమ్రూ నేత పనివారు, బీదరీ సామగ్రి తయారుచేయువారు, నిర్మల్ బొమ్మల పనివారు, తెరలను అలంకరించి జాలరు పనిచేసినట్టి లంబాడీ స్త్రీలు ఉన్నారు. రాష్ట్రపతి వీరం దరితో 1 గంటసేపుకులాసాగా గడిపారు. ఇంతమంది పనివారు, కళాకారులు తమ సమక్షమునకు వచ్చుట చాలా ఆనందంగా ఉన్నదని అన్నారు. సాధారణంగా ఇట్టి పనివారలను విందులకు ఆహ్వానించడం జరుగదు. కాని ఇప్పుడు లోకం మారింది. పెద్ద, చిన్న అనే తారతమ్యం తొలగిపోయింది. అంతా సమానమేనన్న భావం కలుగుతున్నది.

రాష్ట్రపతి నిలయాన్ని అలంకరించడానికి ఉపయోగించబడినట్టి కుటీర పరిశ్రమల వస్తువులను వివిధ సహకార సంస్థలు సరఫరా చేసినవి.

## వనమహోత్సవం

రాష్ట్రపతి వనమహోత్సవంలో పాల్గొన్నారు. రాష్ట్రపతి నిలయం ఆవరణలో వారు రెండు మామిడి



86 ఏండ్ల వృద్ధురాలు రాష్ట్రపతి సోదరి అజంతాలోని ఒక శిల్పాన్నిచూచి ఆనందిస్తున్నారు.



*ఔరంగాబాదులో పౌరసన్మానం అందుకుంటున్న రాష్ట్రపతి.*

మొక్కలు నాటారు. 86 ఏండ్ల వృద్ధురాలగు రాష్ట్రపతి సోదరి, వారి కుటుంబంలోని ఇతర సభ్యులు, వారి పరివారంలోని ఉద్యోగులు దాదాపు వంద మొక్కలు నాటారు.

## సంస్కృత కళాశాల

జులై 2 వ తేదీన రాష్ట్రపతి వేదాంతవర్ధినీ సంస్కృత కళాశాల, ఉన్నతపాఠశాల, వసతిగృహం ప్రాచ్య పరిశోధనాసంస్థ భవనమునకు శంకుస్థాపన చేశారు.

రాష్ట్రపతి ఈ సందర్భంలో ప్రసంగిస్తూ సంస్కృతాన్ని విస్మరించడమంటే మనల్ని, మన ప్రాచీన సంప్రదాయాలను, సుసంపన్నమైన మన సాంస్కృతిక వారసత్వాన్ని మనమే మోసగించుకోవడమని అన్నారు. ఈనాడు మనం నివసిస్తున్నట్టి పరిస్థితులలో మనం ఎవరిమో, మన పుట్టుపూర్వోత్తరాలేమిటో, మన ప్రాచీన వైభవం ఎటువంటిదో తెలుసుకోవడానికి సంస్కృతమే మళ్ళీ అవకాశం కలిగిస్తుందని వారన్నారు.

గతంనుంచి దూరమై, విజ్ఞానశాస్త్రం, సాంఘిక శాస్త్రం, తదితర ఆధునిక శాస్త్రాల ప్రభావంలో పడిపోయి మన ప్రాచీన విజ్ఞాన జీవికను మనలో కొందరు మరచిపోవచ్చు. గతంలోని ఒకానొక సంఘటనను స్మరించుకొని ఆ వైభవమును గుర్తుకు తెచ్చుకోవడానికి మాత్రమే మనం సంస్కృతం అభ్యసించాలని నేను అనడంలేదు. ప్రయోజనం రీత్యా, ప్రత్యక్ష ఉపయోగం దృష్ట్యాకూడా నేనీమాట చెబు



అగ్గిపెట్టెల ఫ్యాక్టరీలో స్త్రీల పనితనమును రాష్ట్రపతి చూచారు.



*రాష్ట్రపతి సికింద్రాబాదు స్టేషనుకు విచ్చేయగానే రాజప్రముఖ్, రాష్ట్ర ముఖ్యమంత్రి తదితరులు స్వాగతమిచ్చారు.*

తున్నాము" అని రాష్ట్రపతి అన్నారు. సంస్కృతానికీ ఇతర భారతీయ భాషలకూ గల సంబంధాన్ని ప్రస్తావిస్తూ ఇవిరెండూ రెండు వేర్వేరు స్థాయీలకు చెందినవి కాబట్టి, వీటి రెండిటి పనులు వేరుకాబట్టి సంస్కృతాన్ని చూచి ఇతర భారతీయ భాషలు, వాటినిచూచి సంస్కృతము బెదిరి పోనక్కర లేదని రాష్ట్రపతి అన్నారు.

భారతదేశంలో అత్యధికులయిన ప్రజల మత సిద్ధాంతాలు సంస్కృతభాషలోనే ఉన్నవి. చాలా మందికి ప్రేరణ కలిగించినది కూడా ఈ భాషే. దేశ వ్యాప్తంగా ఈ భాషలోనే సాహితీకృషి జరిగినది. అయినా సంస్కృతభాష కడు ఉచ్చస్థితిలో ఉన్నప్పుడు కూడా అది ప్రజలభాషగా పరిగణింపబడిందా అన్నది సందేహాస్పదమైన విషయం. ఆ విషయం భాష పేరునుబట్టే మనకు తెలుస్తున్నది. కాలం గడచిన కొద్దీ సంస్కృతం ఒక ప్రత్యేకభాష అయిపోవడం వల్ల స్థానిక భాషలకు పరోక్షంగా బలం చేకూరింది. స్థానిక భాషలు కనీసం సాహితీరంగంలోనయినా సంస్కృతానికి బదులుగా విజ్ఞాన వ్యాప్తికి ఉపయోగపడ నారంభించాయి. ఇప్పుడు ప్రాంతీయ భాషలు బాగా పటిష్ఠమై ఉన్నవి. వీనిలో కొన్నిటికి మంచి సాంప్రదాయములు, పదజాలం, సాహితీరీతులు కలవు. కాని దేనివల్ల అది గ్రంథకర్తలకు ప్రేరణ కలిగిందో, దేనినుంచి ఆ తరువాతికాలపు రచయితలు సాహితీ మూల్యాలను, రీతులను గ్రహించినారో ఆ సంస్కృతభాష అందరికీ సంగమ స్థానంగావున్నది. ఈనాటికికూడా ప్రాంతీయ భాషలలో సుప్రసిద్ధమైన గ్రంథముల భావములు, ఇతివృత్తములు సంస్కృత

కావ్యములనుంచే పరిగ్రహింపబడుతున్నవి. సంస్కృతం ఇండో - ఆర్యన్‌భాషలకు తల్లి అయినప్పటికీ, దక్షిణభారత భాషలపైకూడా దాని ప్రభావం ఇనుమిక్కిలిగా పడినది.

## ఔరంగాబాదు

రాష్ట్రపతి జులై 3 వ తేదీన ఎల్లోరాకు, 4 వ తేదీన అజంతాకు పోవునప్పుడు అయన దర్శనం చేసుకోవలెనని ఔరంగాబాదు చుట్టుప్రక్కల గ్రామస్తులు, స్త్రీలు, పిల్లలు ఎన్నో గంటలపాటు నిరీక్షిస్తూ నిల్చొన్నారు. కాని దురదృష్టవశాత్తు వారికి ఆశాభంగం కలిగింది. రాష్ట్రపతికి అకస్మాత్తుగా సుస్తీ చేయడం వల్ల మూడవ తేదీన తమ కార్యక్రమాన్ని రద్దు చేసుకున్నారు. అయినా తమ గ్రామాలను, రోడ్లను కమానులతో అలంకరించుకున్న గ్రామస్తులు రాష్ట్రపతి పరివారంగోని ఇతర సభ్యులు చరిత్రాత్మకమైన ఆ స్థలాలకు వెళ్ళుతున్నప్పుడు వారికి ఉత్సాహపూర్వకంగా స్వాగత మిచ్చారు.

ఈ పర్యాయం రాష్ట్రపతి స్వయంగా అజంతా చిత్రాలను చూడలేదు. కాని వారి కార్యదర్శి శ్రీ వెంకటాచార్, ఇంకా ఇతరులు మాత్రం చూచారు. 4 వ తేదీన రాష్ట్రపతికి కొంత స్వాస్థ్యం చిక్కింది. ఆనాడు వారు ఎల్లోరా, దౌలతాబాదు కోట, ఖుల్దాబాదులో ఔరంగజేబు సమాధి చూచారు. ఆ తరువాత ఔరంగబాదు పట్టణంలో ఒక బహిరంగసభలో ప్రసంగించారు. సభలో వారికి అనేక సంస్థలవారు పూలమాలలు వేశారు. రాష్ట్రపతి తమ ప్రసంగంలో మహారాష్ట్రులు బొంబాయి నగరంపై తమ హక్కులను



రాష్ట్రపతి నిలయంలో వనమహోత్సవం: రాష్ట్రపతి మామిడిమొక్కను నాటుతున్న దృశ్యం.



హైదరాబాదు ప్రభుత్వం జూబ్లీహాలులో చేసిన విందులో ఆంధ్రరాష్ట్ర గవర్నరుతో రాష్ట్రపతి సంభాషిస్తున్న దృశ్యం.

ప్రకటించు కోవడానికి హింసాయుత పద్ధతుల నవలంబించక శాంతియుత, ప్రజాస్వామిక పద్ధతుల ప్రకారం నడచు కోవలెనని హితవు చెప్పారు. అట్టి రాజకీయ లక్ష్యాలకోసం హింసాయుత పద్ధతుల నవలంబించడం నిరర్ధకమని రాష్ట్రపతి అన్నప్పుడు సభాసదులంతా కరతాళ ధ్వనులతో తమ హర్షం ప్రకటించారు.

ఔరంగజేబు సతి సమాధి "బీబీకామక్బరా"ను రాష్ట్రపతి చూచారు. ఈ సమాధి తాజమహల్ సమూనాలో నిర్మింపబడినది. ఔరంగబాదులోని పాన్‌చక్కీని కూడా చూచారు. రాత్రి 9 గంటలకు ప్రత్యేక రైలులో బొలారం వెళ్ళారు.

ఎల్లోరాలోని శిల్పాలు, విగ్రహములు, రాళ్ళను చెక్కి నిర్మించిన దేవాలయములు, రాళ్ళను తొలిచి నిర్మించిన సభా భవనములు, సాధువులు, సన్యాసులు నివసించిన గుహలు - ఇవన్నీ అద్భుతములైన నిర్మాణాలేకాక బహుకాలం నిలిచివుండునవి. కాని ప్రేక్షకులను మిక్కిలిగా ఆకర్షించేవి అజంతా చిత్రాలు. ఇవి ఇప్పటికే కొందరు మూర్ఖుల దుశ్చర్యలవల్ల కొంత నష్టపడినవి. అయినా కొన్ని రసాయనములను, ఇతర పద్ధతులను ఉపయోగించి ఈ భిత్తి చిత్రాలు మరకొంత కాలం బాగా ఉండునట్లు చేయుటకు సాధ్యమైనంత కృషిచేయబడుతున్నది. ఎంతచేసినా ప్రకృతి మార్పులకూ, కాలప్రభావానికి ఇవి లోనై నెమ్మదిగా

చెదిరిపోతున్నవి. ఈ చిత్రాలు ఏకాలంలో సిద్ధపరచ బడినవో తెలియచేయునట్టి శిలా లేఖనములు కొన్ని చోట్ల ఉన్నవి. కాని అవికూడా ఇప్పుడు చాలావరకు శిథిలమై, చదవడానికి వీలులేకుండా అయిపోయినవి. కొన్ని జాతక కథల ముఖ్యమైన భాగాలను తెలిపే వర్ణచిత్రాలు జీర్ణమైపోయినవి. అయితే కొన్ని ముఖ్య చిత్రాల ప్రతికృతులు, అన్ని చిత్రాల ఛాయాచిత్రాలు ఉన్నవికాబట్టి భారతదేశమునకు అమూల్య నిక్షేపంగా ఎంచబడుతున్న ఈ కళాఖండాల చిహ్నాలైనా మిగులు తున్నందుకు కొంత సంతృప్తి కలుగుతున్నది.

మనుష్య స్వరూపములను చిత్రించడంలో చూప బడిన పనివాడితనం, ఆకారముల వైవిధ్యం, ఆ బొమ్మల కాళ్ళలోను మొహాలలోను వ్యక్తం చేయ బడిన హావభావాలు, ప్రతి చిన్నరేఖను రూపొందిం దంలో తీసుకోబడిన శ్రద్ధ. ఉదాహరణ చెప్పాలంటే స్నానంచేస్తున్న రాకుమారువి తడిసిన తలవెంట్రుక లను, కొందరు స్త్రీల గోళ్ళను చిత్రించడం - ఇవన్నీ అజంతా చిత్రాలలోని ప్రత్యేకతలు. ఈ చిత్రాలన్నిటి సౌందర్యం గుహలలో శక్తివంతమైన దీపములను పెట్టి మాత్రమే చూడగలుగుతాము. కొన్ని శిల్పాల ప్రమాణాన్నిచూస్తే ఆశ్చర్యం కలుగుతుంది. ఒక గుహ వెలుపలగల నాగరాజు శిల్పం ఎంత ఉత్తమంగా తొలచబడిందంటే అమెరికాదేశపు పత్రిక ఒకటి దీన్నిగూర్చి వ్రాస్తూ ఈ శిల్పాన్ని అంతవరకు రాతి నుంచి విడదీసి ఒక మ్యూజియంలో భద్రపరచవలెనని అభిప్రాయమిచ్చింది. అజంతా గుహలలో గల అనేక శిల్పాలను ఈ విధంగా ఒక మ్యూజియంలో భద్ర పరచబడుటకు అర్హమై ఉన్నవి. అయితే ఆచరణ రీత్యా అట్లా చేయడం సులభసాధ్యం కాదు.



*హైదరాబాదులో జరిగిన హిందీ ప్రచార సమ్మేళనంలో రాష్ట్రపతి ప్రసంగిస్తున్న దృశ్యం.*



హైదరాబాదు కేన్సర్ ఆసుపత్రి రాష్ట్రపతి సందర్శించారు.

## పద్మభూషణ్ బిరుద ప్రదానం

రాష్ట్రపతి జులై 5 వ తేదీన పురప్రముఖులకు స్వాగత మేర్పాటుచేసి శ్రీ మాడపాటి హనుమంత రావుగారికి పద్మభూషణ బిరుదప్రదానం చేశారు.

## సైనికదళాల తనిఖీ

భారతదేశ సైనిక దళాలకు రాష్ట్రపతియే సర్వ సైన్యాధిపతి. కనుక వారు జులై 6 వ తేదిన ఇ. యం. ఇ. సెంటర్ యొక్క రెండు బెటాలియను లను, సికింద్రాబాదు కంటోన్మెంటులోవున్న ఆర్మీ ఆర్డినెన్సు కోర్ యొక్క ఒక విభాగాన్ని సందర్శించారు.

ఎలక్ట్రికల్, మెకానికల్ ఇంజనీర్సు కోర్ సెంట రులో రాష్ట్రపతి బాలుర శిక్షణ విభాగాన్నిచూచి, బాలుర హాబీ సెక్షనును తనిఖీచేసి, ఆ తరువాత బొమ్మల రైలుబండిని, సమాచారగదిని చూచారు. సమాచార గదిలో పెద్ద ప్రపంచపటము ఒకటి ఉన్నది. అందులో ప్రతి దేశంయొక్క వైశాల్యము, జనాభా, సముద్ర మార్గాలు, వాయుమార్గాలు, వివిధ దేశాల అధిపతులు, ప్రధానమంత్రుల పేర్లు, ఒక్కొక్క దేశ ప్రభుత్వ వివరములు, ప్రతి ప్రాంతంయొక్క కీలక ప్రాముఖ్యం వివరించబడినవి. ఈ పటమును రాష్ట్రపతి చాలా శ్రద్ధగా పరిశీలించారు. ఆ గదిలో నయాపైసా అంటే క్రొత్తనాణెముల పటముకూడా ఒకటి వున్నది. ఆ నాణెముల వివరములను తెలుసుకోవడానికి తగుసూచీ కూడా దానిపై గలదు. రాష్ట్రపతి పది నిమిషములసేపు బాలుర వ్యాయామ ప్రదర్శనాన్ని చూచారు. ఇ. యం. ఇ. కేంద్రంయొక్క మూడవ ట్రెయి

వింగు బెటాలియన్‌వద్ద రాష్ట్రపతి బోధనా తరగతులను చూచి అక్కడ హిందీ బోధనాభాషగా ఉపయోగింపబడుతున్నందుకు తమ ప్రశంస తెలిపారు. సైన్యం రణరంగంలో తరలి పోతున్నప్పుడు లోతుగా, ఉరవడిగా ప్రవహించే నదులపై జీపులను, టాంకులను పైతీగెల ఆధారంతో ఎట్లా దాటించేదీ రాష్ట్రపతికి ఇక్కడ ప్రదర్శించి చూపబడింది.

సైనిక ఆర్డినెన్సు కోర్ కేంద్రంలో రాష్ట్రపతి చేతి పరిశ్రమల శిక్షణ సంస్థను చూచారు. సైన్యంలో ఇటువంటిసంస్థ ఇదే మొట్ట మొదటిది. ఇందులో పింఛను పుచ్చుకొనే సైనికులకు, సైన్యంనుంచి తీసివేయబడువారికి, రిజర్వు దళాలకు బదిలీ చేయబడువారికి చేతి పరిశ్రమలలో శిక్షణ ఇవ్వబడుతుంది. ప్రతిరోజు విరామ వేళలలో కుట్టుపని, వర్ణచిత్ర రచన, బెత్తపు తీగెలతో అల్లికపుపని, సూదితో అల్లికపుపని, లేసు పని, సబ్బులు చేయడం, బొమ్మలు చేయడం, నవారు నేయడం, తోళ్ళపరిశ్రమ మున్నగు వృత్తులలో తరగతులునడుపబడతాయి. రాష్ట్రపతి అక్కడ ఒకమామిడి మొక్కనాటి తమచిత్ర పటంపై చేవ్రాలు చేశారు.

ఆ తరువాత రాష్ట్రపతి కుటుంబ సంక్షేమకేంద్రాన్ని చూచారు. ఆ కేంద్రం యొక్క క్షేత్రం ముందు కొద్ది నిమిషముల సేపు ఆగి, ఇక్కడ పండిన రెండు బొప్పాయి కాయలు స్వీకరించారు.

## హిందీ

జూలై 7 వ తేదీన రాష్ట్రపతి ఎగ్జిబిషన్ హాలులో హైద్రాబాదు హిందీ ప్రచార సమ్మేళనానికి ప్రారంభో



*హైదరాబాదులో గాంధీ భవన్‌కు రాష్ట్రపతి ప్రారంభోత్సవం సల్పారు.*



*రాష్ట్రపతి సతీమణి హైదరాబాదులోని ఆంధ్ర యువతీమండలిని సందర్శించారు.*

త్సవం చేశారు. భారత రాజ్యభాషగా హిందీ ఎందుకు నిర్ణయింపబడిందీ వివరిస్తూ భారతదేశం స్వతంత్రదేశమైన తరువాత ఇంగ్లీషుభాషను ఇప్పుడున్న విధంగా ఉంచివేయడానికి ఆత్మగౌరవం గల ఏ భారతీయుడూ ఇష్టపడడని రాష్ట్రపతి అన్నారు. అయితే కొన్నేండ్ల పర్యంతంగా ఉపయోగించబడుతూ వచ్చిన ఒకభాషను తొలగించి దాని స్థానే మరొక భాషను పెట్టడం అంత సులభమైన పనికాదు. అందుకు ఆచరణరీత్యా కొన్ని ఇబ్బందు లున్నవి. కనుక ఇట్టి మార్పును అమలులోకి తేవడానికై పదిహేనేండ్ల గడువు నిర్ణయింపబడింది. ఈ గడువులో అప్పుడే ఆరేండ్లు గడచిపోయ్యాయి. కనుక ఇంగ్లీషు స్థానంలో హిందీభాషను ప్రవేశపెట్టుటకై జరగవలసిన పనిని వచ్చే తొమ్మిదేండ్లలో పూర్తి చెయ్యాలని రాష్ట్రపతి అన్నారు.

హిందీ భాష మాట్లాడబడనట్టి ప్రాంతాలలో ప్రాంతీయభాషల యొక్క రంగాలపై దురాక్రమణచేయడం హిందీ ప్రచారం యొక్క లక్ష్యం కాదని రాష్ట్రపతి అన్నారు. మరి హిందీ ప్రచారానికి ఇంత ప్రాముఖ్యం ఎందు కివ్వబడుతున్నదంటే ఆ భాష అంతర్రాష్ట్రీయ వ్యవహారాలకు ఉపయోగింపబడుతుంది. దానికి సకల భారత ప్రాముఖ్యం ఉన్నది. సువిశాలమైన ఈ దేశంలోని విభిన్న ప్రాంతాలకు ఐక్యత చేకూర్చడానికీ, సమన్వయం కలిగించడానికీ, రాష్ట్రాలను ఒకదానినొకటితో సన్నిహితం చేయడానికి అఖిల భారత భాష ఒకటి అత్యవసరమై వున్నది.

అధికార భాషా సంఘం నియామకాన్ని ప్రస్తావిస్తూ రాష్ట్రపతి ఇలా అన్నారు: ఆ సంఘం వారి సిఫారసులు అద్యతన భావిలో వెలువడనున్నవి. హిందీని ప్రవేశ

పెట్టడం వల్ల హిందీభాష మాట్లాడబడనట్టి ప్రాంతాల ప్రజలకు ఎటువంటి ఇబ్బంది, అసౌకర్యం కలుగ కూడదని ప్రభుత్వం భావిస్తున్నది. ప్రతి భారతీయుడూ, అతడి మాతృభాష ఏదైనప్పటికీ, ప్రభుత్వోద్యోగాలకు ఎన్నిక చేయబడే విషయంలో సమానావకాశములు కలిగిఉండవలెను. అట్టి హామీ అందరికీ కలదు. కనుక ఈ విషయంలో ఏ ప్రాంతమువారూ అపోహలు పెట్టుకోనక్కరలేదు. ఈ సమస్యా పరిష్కారంలో ప్రజలు సాయశక్తులా ప్రభుత్వంతో సహకరించాలి అని రాష్ట్రపతి అన్నారు.

హిందీ ప్రచార సమ్మేళనం సందర్భంలో ప్రదర్శించబడిన సంస్కృత, ఉర్దూ నాటికలను రాష్ట్రపతి చూచారు.

## గాంధీ భవన్

జులై 8 వ తేదీన రాష్ట్రపతి గాంధీ భవన్ ప్రారంభోత్సవం సల్పారు. మనం భవనాలు కట్టి గాంధీజీని శాశ్వతంగా స్మరించుకోగలమా లేక జీవితములో ఆయన పాటించిన సూత్రాలను ఆచరించి ఆయనను శాశ్వతంగా జ్ఞాపకం ఉంచుకోగలమా అని తమ ఆశ్చర్యం వెలిబుచ్చారు. గాంధీభవన్ కేవలం రాళ్ళతో, ఇటుకలతో నిర్మింపబడిన భవనం మాత్రమే కాదనీ, అది గాంధీజీకి "సజీవస్మారక" మనీ తెలుసుకొని రాష్ట్రపతి తమ సంతోషం వెలిబుచ్చారు.

మహాత్మాజీ బ్రతికి ఉండగా చరఖాపై విశ్వాసం లేకపోతే అభ్యుదయం అసాధ్యమని ఆయన ప్రజలకు



రాష్ట్రపతి నిలయంలో జనరల్ కరియప్పతో సంభాషిస్తున్న రాష్ట్రపతి.



హైదరాబాదులో రాష్ట్రపతి మకాంచేసిన కాలంలో తీయబడిన ఛాయాచిత్రాల ఆల్బమును ముఖ్యమంత్రి రాష్ట్రపతికి సమర్పిస్తున్నారు.

స్పష్టంగా చెప్పారు. చరఖాపై విశ్వాసం లేకపోయి నట్లయితే దానిని వారు ఆయన జీవించి ఉన్నంతవరకే వాడతారు. ఆయన గతించిన తరువాత వదిలివేస్తారు. చరఖావిషయంలో ఏమి జరుగుతుందో గాంధీజీ ఇతర సిద్ధాంతాల విషయంలో కూడా అదే జరుగుతుంది, అని డాక్టర్ ప్రసాద్ అన్నారు.

గాంధీభవన్ రూ 5½ లక్షల వ్యయంతో నిర్మింప బడింద. ఇది మొజంజాహీ రోడ్డులో వున్నది. నగరంలోని గొప్ప భవనాలలో ఇది ఒకటి. ఇందులో దేశ్ కాంగ్రెసు కార్యాలయం, భూదాన సమితి, ఖాదీ మహిళా సమాజ్, ఇండియన్ నేషనల్ ట్రేడు యూనియన్ కాంగ్రెసు, అఖిల భారత ఖాదీ గ్రామీణ పరిశ్రమల బోర్డు కార్యాలయాలు ఉన్నవి. గాంధేయ గ్రంథాలయం గాంధియన్ పరిశోధన కేంద్రం కూడా ఇందులో తెరవబడ నున్నవి. గాంధీభవన్‌కు ఒక విశాలమైన హాలుకూడా కలదు. ఈ హాలులో 2500 మందికి పైగా ప్రేక్షకులు కూర్చోవచ్చును. ఈ భవన్ నిర్మాణానికి ఐదున్నర ఏండ్లు పట్టింది. ఇది ఒక ట్రస్టు యాజమాన్యం క్రింద వున్నది. ట్రస్టులో పార్టీలతో సంబంధం లేని వ్యక్తులు కూడా సభ్యులుగా ఉన్నారు.

[తరువాయి ౨౮ వ పుటలో]

# నాగార్జునసాగర్ ఆనకట్ట స్థలంవద్ద శిక్షణ కేంద్రం

నాగార్జునసాగర్ ఆనకట్టవద్ద హైద్రాబాదు వైపు ౧౯౫౬ జూన్ ౨౭ తేదీన ఒక శిక్షణ కేంద్రం నెలకొల్పబడింది. ఈ కేంద్రంలో ౪౦ మంది వ్యక్తులకు భారీ యెత్తున మట్టిని తీసివేయు యంత్రములను నడుపు శిక్షణ ఇవ్వబడుతున్నది.

శిక్షణ కాలం ఒక సంవత్సరం. అమెరికన్ స్పెషలిస్టు మెకానిక్, అమెరికన్ స్పెషలిస్టు ఆపరేటర్ అభ్యర్థులకు శిక్షణ గరుపుతారు. అభ్యర్థులలో ఇరవై మంది ఆపరేటర్లుగాను, మిగతా ఇరవైమంది మెకానిక్‌లుగాను శిక్ష పొందుతారు.



కేంద్ర జల, విద్యుచ్ఛక్తి కమీషన్ అధ్యక్షులు శ్రీ కన్వార్ సేన్ స్వాగతపత్రం చదువుతున్నారు.



*యూనియన్ డిప్యూటీమంత్రి శ్రీ జై సుఖ్ లాల్ హాతీ ప్రారంభోపన్యాసమిస్తున్నారు.*

భారత ప్రభుత్వ నీటి వనరులు, విద్యుచ్ఛక్తి శాఖల ఉపమంత్రి శ్రీ జైసుఖ్‌లాల్ హాతీ ఈ శిక్షణ కేంద్రానికి ప్రారంభోత్సవం చేస్తూ అభ్యర్థులు కేవలం ఆపరేటర్, మెకానిక్ పనులు చక్కగా నేర్చుకోవడమే గాక, యంత్రములను కడు జాగరూకతతో నడపాలని హితవు చెప్పారు. వారు ఏమాత్రం ఉపేక్ష వహించినా జాతికి గొప్ప నష్టం కలుగుతుందని ఆయన హెచ్చరించారు. "యంత్రము ఒక ట్రస్టు వంటిది. అది మీ యాజమాన్యం క్రింద వుంటుంది. జాతి క్షేమం కొరకై మీరు దానిని నడుపుతున్నారు. కనుక ఎంతో జాగ్రత్తతో నడపండి. ఏదైనా లోపం ఉంటే సకాలంలో సరిచేయండి" అని ఆయన అభ్యర్థులను కోరారు. శ్రీ హాతీ ఇంకా ఇలా అన్నారు: "కోట్ల రూపాయలు విలువచేయ యంత్రము ప్రాజెక్టులకై ఉపయోగించబడుతున్నది. వలసినంత మంది శిక్షణ పొందినవారు లేకపోవడంవల్ల యంత్రములు నిరుపయోగంగా మూలపడి ఉన్నవి, అందువల్ల పెట్టుబడి వృధా కావడమే గాక ప్రాజెక్టు పనులు ఆలస్యంగా కూడా జరుగుతున్నవి."

నదీలోయ ప్రాజెక్టులు నిర్మించుటకు భారీ యెత్తున మట్టిని తీసివేయవలసి వస్తుంది. సాధ్యమయిన పరిస్థితులలో కార్మికులను నియమించడం జరుగుతున్నప్పటికీ పని చురుకుగాను, శీఘ్రంగాను ముగియుటకు యంత్రములను ఉపయోగించడం అవసరమవుతున్నది.

గత ఐదేండ్లలో దేశంలో నీటి వసరుల క్రింద సేద్యభూమి ౨౦ మిలియన్ ఎకరాలవరకు పెరిగింది. ఇప్పుడు కొనసాగుతున్న వివిధ అభివృద్ధి ప్రాజెక్టుల వల్ల కొద్దికాలంలో దేశ పరిస్థితులు ఎంతో మార్పు చెందగలవు. జాతి నిర్మాణ కృషిలో కొంత పాత్ర వహించే అవకాశం కలిగినందుకు శిక్షితులు అదృష్ట వంతులు అని శ్రీ హాతీ అన్నారు.

## మానవునికీ యంత్రానికీ మధ్య ఘర్షణ లేదు

శిక్షణకేంద్రపు ప్రారంభోత్సవానికి హైద్రాబాదు ముఖ్యమంత్రి డా. బి. రామకృష్ణారావు అధ్యక్షత వహించారు. ముఖ్యమంత్రిగారు మాట్లాడుతూ మానవునికీ, యంత్రానికీ మధ్య ఘర్షణలేదు. సహజీవన సిద్ధాంతాన్ని మనం స్వీకరించినాము కనుక మనిషీ, యంత్రమూ పరస్పర సహాయంగా మనవలసిందే, అని అన్నారు.

భాక్రాలో ౩౦౦ మంది ఇంజనీర్లు, ౭౦౦౦ మంది కార్మికులు భారీ యంత్రముల సహాయంతో పని చేస్తున్నారు. తుంగభద్ర ప్రాజెక్టు పనిలో ఒకసారి ౩౦,౦౦౦ మంది వ్యక్తులు నియమించబడినారు.

శిక్షణ పొందుతున్నవారు యంత్రాలను జాగ్రత్తగా నిర్వహించాలని చెబుతూ డా. రావు ఇలా అన్నారు: "రైతు తన పశువులను ఎంత జాగ్రత్తగా చూస్తాడో, మీరు కూడా యంత్రాలను అంత నేర్పుగాను, జాగ్రత్తగాను నిర్వహించాలి."

ఇట్టి శిక్షణ కేంద్రాలు అనేకం అవసరమవుతాయని ముఖ్యమంత్రి అన్నారు. ఇప్పుడు శిక్షణ పొందినవారు,




హైదరాబాదు ముఖ్యమంత్రి డా. బి. రామకృష్ణరావు కృతజ్ఞతాభివందనములు చెబుతున్నారు.



*భారీయంత్రసామగ్రి ఇంటర్‌నేషనల్ హార్వెస్టర్ బుల్‌డోజర్ యంత్రం.*

కొంతకాలం తరువాత ఇతరులకు శిక్షణ ఇవ్వగలరని తమ ఆశను వెలిబుచ్చారు.

సెంట్రల్ వాటర్ అండ్ పవర్ కమీషన్ అధ్యక్షులు శ్రీ కన్వర్‌సేన్ వివిధ ప్రాజెక్టులను గూర్చి మాట్లాడుతూ, దేశంలో మానవశక్తిని సంపూర్ణంగా వినియోగించుటకు అన్ని విధాలా కృషి చేయబడుతున్నదనీ అయితే నీళ్ళలో పనిచేయాల్సి వచ్చునపుడు, భారీ సామగ్రిని ఎత్తవలసి వచ్చినపుడు, పని సకాలంలో జరుగుటకు యంత్రములు ఉపయోగించ బడుతాయనీ తెలియజేశారు.

దేశంలో ఇట్టి శిక్షణ కేంద్రాలు నాగార్జునసాగరం వద్ద ఒకటి, కోటాలోని చంబల్ ప్రాజెక్టు వద్ద మరొకటి మొత్తం రెండు మాత్రమే ఉన్నాయి.

భారీ నదీ లోయ ప్రాజెక్టులను నిర్మించుటకు పూనుకోవడం వల్ల ఇట్టి శిక్షణ కేంద్రాలను తెరవడం అవసరమయింది. ఈ రెండుకేంద్రాలకు సాంకేతిక సహకార సహాయ పథకం క్రింద అమెరికా నుంచి రూ. ౧౩.౫ లక్షల విలువచేయు యంత్ర పరికరములు దిగుమతి చేయబడినవి.

## శిక్షణ కార్యక్రమ వివరాలు

*ప్రథమ దశ :* మొదటి నాలుగు నెలల్లో అభ్యర్థులందరికీ మట్టిని ఎత్తివేయు భారీ యంత్రమును నడుపుటలో ప్రాక్టికల్ ట్రెయినింగు ఇవ్వబడుతుంది. దీనితోపాటు వర్కుషాపులోకూడా అట్టి యంత్రమును మరమ్మతు చేయడంలోను దానిని సక్రమంగా నిర్వహించడంలోను శిక్షణ ఇవ్వబడుతుంది. యంత్రములను ఏవిధంగా నడపాలి ? అవి చెడిపోతే, ఏవిధంగా మరమ్మతు చేయాలి ? అను విషయములపై సాంకేతిక ఉపన్యాసము లివ్వబడుతాయి. ఈ నాలుగు నెలల్లో



*రిబ్బన్ కత్తిరిస్తున్న యూనియన్ డిప్యూటీమంత్రి శ్రీ హాతీ.*

రోజూ సగం కాలం యంత్రమును నడుపుటకును, మిగతా కాలం వర్కుషాపులో పని చేయుటకును కేటాయించబడుతుంది. ఈ శిక్షణ పూర్తి అయిన తరువాత శిక్షణ పొందిన వారికి యంత్రమును నడుపుట యందు ఆసక్తి ఉన్నదా? దాని నిర్వహణ యందు శ్రద్ధ ఉన్నదా? అని కనుగొనుటకు ఒక పరీక్ష జరుపబడుతుంది.

*రెండవ దశ:* ప్రథమ దశానంతరం అభ్యర్థులు రెండు జట్లుగా విడదీయ బడుతారు. మిగిలిన ఎనిమిది నెలల్లో వారికి ఆపరేటర్లుగాను లేక మెకానిక్‌లుగాను ప్రత్యేక శిక్షణ ఇవ్వబడుతుంది.

*ఆపరేటర్‌లకు శిక్షణ:* యంత్రములు నడుపుటకు ఎన్నుకోబడిన అభ్యర్థులకు, త్రవ్వకపు యంత్రమును, డంపర్లు, బుల్‌డోజర్లు, మోటారుతోనడుచుస్క్రేపర్లు, మోటారు గ్రేడర్లు మున్నగు వాటిని నడుపడంలో శిక్షణ ఇవ్వబడుతుంది.

*మెకానిక్‌లకు శిక్షణ:* యంత్రములను మరమ్మతు చేయడం, పెట్రోలు ఇంజన్లు, డీజెల్ ఇంజన్లను బాగు పరచడం, మెషీనింగ్, ఫిట్టింగ్, వెల్డింగ్‌లలో వర్కుషాప్ ప్రాక్టీసు మున్నగు విషయాలలో శిక్షణ ఇవ్వబడుతుంది. యంత్రములు సక్రమంగా పనిజేస్తున్నదీ, లేనిదీ తెలుసుకొనుటకు అభ్యర్థులు ఫీల్డ్ పని కూడా చేస్తారు.

*మూడవ దశ:* వర్షర్తువు నుంచి అభ్యర్థులకు సాంకేతిక సహకార పథక నిపుణులు, ఇతర సంస్థల

[తరువాయి ౨౦ వ పేజీలో]

# * ప్రజలు : ప్రణాళిక : ప్రచార సాధనాలు *

ప్రథమ పంచవర్ష ప్రణాళికను అమలు పరచుటకు పూనుకొన్నపుడు మన నాయకులను ఒక సమస్య ఎదుర్కొన్నది. ప్రణాళిక విజయవంతంగా పూర్తికావాలంటే ప్రజల సహకారం లభించాల్సి ఉంటుందని వారు గుర్తించారు. ప్రణాళికను అమలుపరచుటకై ప్రభుత్వానికి సహాయంచేసే ముందు, ప్రణాళిక అంటే ఏమిటో ప్రజలకు తెలిసిఉండాలి. ప్రజానీకానికి ప్రణాళికా విశేషాలను అందజేయాలంటే దీని విషయమై ఉపన్యాసాలివ్వడం, వ్యాసాలు వ్రాసి పత్రికలలో ప్రచురింపజేయడం సాధనాలుగా ఉపయోగించుకోవచ్చును. నలువది కోట్ల మంది ప్రజానీకంముందు నిలబడి మాట్లాడడం సాధ్యంకాని పని. పైగా మన దేశ ప్రజలు ౧౪ భాషలకు చెందినవారు. అంతేగాక నూటికి తొంభై మంది ప్రజలు నిరక్షరాస్యులైనందున వారు చదువరు. చదువలేరు కూడా.

ఈ క్లిష్ట పరిస్థితిలో ఆధునిక విజ్ఞాన శాస్త్రం కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలకు చాలా ఉపయోగపడుతున్నది. ప్రణాళిక యొక్క ప్రాథమికసూత్రాలను, దాని ప్రాముఖ్యతను ప్రజలకు తెలియజేయడమే ఒక సమస్యగా ఉన్నది. రేడియో, చలన చిత్రములు, వార్తాపత్రికలను ఉపయోగించడంతో ఈ సమస్య పరిష్కరించబడుతుంది.

మన ప్రధాన మంత్రి ప్రజలందరికీ ఏదైనా చెప్పదలచుకొంటే ఆయన దేశంలోని ఏ రేడియోస్టేషనుకైనా వెళ్ళి ప్రసారం చేయగలరు. ఆయన ఈ కార్యక్రమాన్ని, రేడియో స్టేషనులు రిలే చేస్తాయి. ఆలిండియా రేడియో వార్తలు విను శ్రోతలు ఈ కార్యక్రమాన్ని వినగలరు. అయితే ఇందులో ఒక లోపముంది. ప్రజలందరికీ రేడియోసెట్టులు లేవు. మనదేశ జనాభాను పరిశీలిస్తే రేడియో వున్న ప్రజల సంఖ్య చాలా స్వల్పము. మనది బీద దేశం. కనుక ప్రతి కుటుంబానికి ఒక రేడియో సెట్టు ఉండడం సాధ్యం కాదు. ఇందులో మరోఇబ్బంది ఏమంటే విద్యుచ్ఛక్తి సరఫరా తక్కువగా ఉన్నది. మన గ్రామాలకు ఇట్టి సౌకర్యం లేదు. అంటే ఎనభై శాతం జనాభాకు రేడియో వార్తలు విశేషాలు వినే అవకాశం లేదన్నమాట. ఇట్టి పరిస్థితిలోనే విజ్ఞానశాస్త్రం మనకు చాలా సహాయపడుతున్నది. బ్యాటరీ సహాయంతో మనం రేడియో సెట్టును ఉపయోగించుకోవచ్చును. బ్యాటరీలు వెట్ బ్యాటరీ, డ్రై బ్యాటరీ అని రెండు రకాలుగా ఉన్నాయి. మోటారు కారులో వెట్ బ్యాటరీ ఉపయోగించబడుతుంది. బ్యాటరీ లైట్లలో డ్రైబ్యాటరీ ఉపయోగించబడుతుంది. వెట్ బ్యాటరీని ఛార్జి, రీ ఛార్జి చేయవలసి వస్తుంది. మన గ్రామాలలో అందుకు వలసిన సౌకర్యాలు లేవు. కనుక దీనిస్థానే డ్రైబాటరీని ఉపయోగించవచ్చును. రెండింటికి అయ్యే ఖర్చులు ఒకటే నని అనుభవంవల్ల కనుగొనబడింది. కనుక గ్రామాలకు డ్రైబ్యాటరీతో నడుచు రేడియో సెట్టులను సరఫరా చేయుటకు నిర్ణయించబడింది. వీటినే కమ్యూనిటీ రేడియో సెట్టులని అంటారు. గ్రామస్థులు సాయంత్రం ఒకచోట కూడి వారికొరకు ప్రత్యేకంగా ప్రసారం చేయబడు కార్యక్రమాలను వింటారు. అయితే ప్రభుత్వం స్వయంగా గ్రామానికి రేడియోసెట్టు ఇవ్వదు. అందుకై ప్రజలు కొంత పాటుపడాలి. ఈ సెట్టులను రియాయతీ రేట్లపై సరఫరా చేయాలని నిర్ణయించబడింది. మన పరిస్థితులకు అనువగు రేడియో సెట్టులను నిర్మించుటకు ఒక్కొక్కదానికి రూ. ౩౦౦ లు ఖర్చవుతుంది. అందులో భారత ప్రభుత్వంవారు రూ. ౧౫౦ భరిస్తామని అన్నారు. మిగిలిన దానిలో సగం ఖర్చు అంటే రూ. ౭౫ లు

భరించుటకు రాష్ట్ర ప్రభుత్వం అంగీకరించింది. ఈ విధంగా రూ. ౩౦౦ ఖర్చుఅయ్యే రేడియోసెట్టు గ్రామ పంచాయతీలకు, ఇతర గ్రామీణ సంస్థలకు రూ. ౭౫ లకు మాత్రమే ఇవ్వబడుతుంది. వాస్తవంగాచూస్తే సుమారు ౫ వేల జనాభాగల గ్రామం ఒక కమ్యూనిటీ రేడియోసెట్టును కొనే పరిస్థితిలో ఉండగలదు. రేడియోసెట్టును నడుపుటకు రూ. ౨౦౦ లు కాగల దని తేలింది. అందులో సగంఖర్చును భరించుటకు రాష్ట్ర ప్రభుత్వం అంగీకరించింది. అంటే గ్రామం రూ. ౧౦౦ లు మాత్రయే భరించవలసివుంటుం దన్న మాట. ఈ పథకంనుంచి లాభం పొందడం గ్రామ స్తుని శ్రద్ధాసక్తులపై ఉంటుంది. హైద్రాబాదు రాష్ట్రంలో ద్వితీయ పంచవర్ష ప్రణాళికక్రింద ౨౦౦౦ రేడియో సెట్టులను నెలకొల్పుటకు తలపెట్టబడింది.

ఈ విధంగా ప్రణాళిక విశేషములేగాక సంగీతము సాంస్కృతిక కార్యక్రమాలుకూడా రేడియోద్వారా పల్లెపల్లెకు చేరుటకు అవకాశ మున్నది. రేడియో ప్రపంచ వార్తలను పల్లెలకుకూడా అందజేయు సాధ నముగ ఉపయోగించబడుతున్నది.

## చలన చిత్రం

ప్రచారక సాధనములలో రేడియో తరువాత చెప్ప దగినది సినిమా. సినిమా విషయం మనం ఎంతో మాట్లాడుతాము. అయితే దేశంలో సినిమా థియేటర్ల సంఖ్య ఐదు, ఆరువేలు వుంటుంది. భారతదేశంలో ౫న్నరలక్షలగ్రామాలున్నాయి. అంటే సినిమాచూడని ప్రజలు సినిమాచూచిన వారికన్నా ఎక్కువగా ఉన్నా రన్నమాట. పెద్ద సినిమా హాల్సు లేనందువల్లనూ విద్యుచ్ఛక్తి లేకపోవడం వల్లనూ, మనకు ఎక్కువ సినిమా లుండడానికి సాధ్యం కావడంలేదు. అయితే ఇక్కడకూడా విజ్ఞానశాస్త్రము మనకు సహాయపడు తున్నది. చిన్న మరియు మధ్యరకంసైజు సినిమాలు కూడా కలవు. వాటిని మోటారుకార్లకు అమర్చి గ్రామసీమలకు గొనిపోయి బహిరంగస్థలంలో రాత్రి పూట ప్రదర్శించవచ్చును. దీనినే ౧౬ యం. యం. ఫిల్ము అంటారు. మోటారుకారు పోగలిగిన ప్రాంతా లన్నింటిలో దీనిని ప్రదర్శించుటకు వీలుంటుంది. భారత ప్రభుత్వ ఫిల్మ్సు డివిజన్‌వారు ప్రణాళికక్రింద మనం సాగించుతున్న ప్రగతిని ఫిల్ముల రూపములో తీస్తున్నారు. ఈ ఫిల్ములు రాష్ట్రాలకు పంపబడు తాయి. రాష్ట్ర ప్రభుత్వాలు తమతమ సంచార శకట ములద్వారా వీటిని ప్రజలకు చూపుతాయి. భారత ప్రభుత్వంవారు జిల్లాలకుకూడా శకటములను పంపు తున్నారు. ద్వితీయ పంచవర్ష ప్రణాళికక్రింద మన రాష్ట్రంలో ప్రతిజిల్లాకు ఒక సంచారక సినిమా శక టము ఉంటుంది. కొంతకాలం తరువాత మనకు ప్రతి జిల్లాలో ఒకటికన్న ఎక్కువగానే సంచారక సినిమా శకటాలు ఏర్పడవచ్చు.

మనదేశ జానపదవాసులకు విద్య మరియు విజ్ఞాన విషయాలు తెలియజేయుటకు, వినోదము కల్పించు టకు రేడియో, సినిమా - ఈరెండూ సాధనములు విజయవంతంగా ఉపయోగించవచ్చును. రేడియో వార్తలు మరియు సినిమాలను అర్థంచేసుకొని ఆనం దించాలంటే ప్రజలు విద్యావంతులై ఉండనవసరం లేదు. రేడియో వార్తలు వినువారికీ, సినిమాలు చూచు వారికి అవి సులభంగా అర్థమవుతాయి.

విద్యావంతు లయిన ప్రజల ఉపయోగార్థమై కేంద్ర రాష్ట్రప్రభుత్వాలు అన్నిభాషలలోను పుస్తకాలను ప్రచు రిస్తున్నవి. ప్రణాళికను విరివిగా ప్రచారంలోకి తెచ్చు టకై వార్తాపత్రికలు ప్రభుత్వానికి సహాయపడుతున్నవి. మన గ్రామాలలోని పఠనాలయాలలో విద్యావంతు లయిన వ్యక్తులు పత్రికలు చదువుతారు. వారి చుట్టూ చేరు ప్రజలు ఆ వార్తల విశేషాలు తెలుసుకొంటారు.

ప్రణాళిక ప్రచారానికి రేడియో, సినిమా, వార్తా పత్రికలు, యీమూడు సాధనములేగాక ప్రభుత్వము వారు ప్రదర్శనము, సాంగ్ అండ్ డ్రామాలనుకూడా ఉపయోగిస్తున్నారు. ప్రదర్శనములను గ్రామీణ ప్రాంతా లకు తీసుకొనిపోవుటకు కేంద్రంలోను, రాష్ట్రాలలోను ఏర్పాట్లు చేయబడినవి. ఇందుకు నమూనాలు, చార్టులు ఛాయాచిత్రాలు ఉపయోగింపబడుతాయి.

మనదేశంలో సంగీతానికి ప్రజలపై మంచి ప్రభావ మున్నది. కబీర్, నానక్, బసవుడు, త్యాగరాజు, పురం

దరదాసు; తుకారాం మున్నగు గొప్పభక్తులు ప్రజలకు బోధించుటకై సంగీతమును ఉపయోగించినారు. నేటికీ, మనగ్రామాలలో కొంతమంది సంచారక గాయకులు తమ బుర్రకథలద్వారా ధర్మాన్నీ, నీతినీ ప్రచారం చేస్తూనే ఉన్నారు. ప్రణాళికను ప్రచారంలోకి తెచ్చుటకై ప్రభుత్వం బుర్రకథలను కూడా ఉపయోగిస్తున్నది. ఈ సాధనానికి మంచి అవకాశాలున్నవి.

బుర్రకథల తరువాత పేర్కొనవలసింది నాటకం. ప్రభుత్వ ప్రోత్సాహంపైన ప్రణాళికలో తలపెట్టబడిన నూతన జీవితమునుగూర్చి అనేక నాటకములు రచించబడినవి. తిరునాళ్ళలో, జాతర్లలో ఈ నాటకాలను ప్రదర్శించుటకు ప్రభుత్వం కొంత డబ్బు చెల్లిస్తుంది. ఈ విధంగా లభ్యమైన సాధనాలన్నిటిద్వారా ప్రజలలో ప్రణాళిక ప్రచారం కొనసాగించబడుతున్నది.

---

## * హైదరాబాదులో రాష్ట్రపతి *

[ ౨౦-వ పుట తరువాయి ]

భారత సాంఘికసేవా మహాసభ హైద్రాబాదు శాఖ వారి ఆహ్వానాన్ని పురస్కరించుకొని డాక్టర్ ప్రసాద్ కేన్సర్ ఆసుపత్రి, రేడియం ఇన్‌స్టిట్యూట్‌లను సందర్శించి రూ 300 లు విరాళం ఇచ్చారు. ఆ ఆసుపత్రిలోని వివిధ వార్డులను, విభాగాలను, యంత్రసామగ్రిని ఆయన చూచారు.

రాష్ట్రపతి రాజేంద్రనగర్‌లోని కిద్వాయి కుటీరంలో వనభోజనంచేశారు. ఆసఫ్‌నగర్‌లోని కుటుంబ సంక్షేమ అగ్గిపెట్టెల పారిశ్రామిక సహకార సంఘమును సందర్శించారు.

రాష్ట్రపతి గౌరవార్థం రాష్ట్ర ప్రభుత్వం స్వాగత, విందు ఏర్పాటు చేసింది. దీనికి వెయ్యి మందికి పైగా అతిథులు విచ్చేశారు.

జులై 8 వ తేదీన రాష్ట్రపతి సతీమణి, సోదరి, ఆయన కుటుంబంలోని ఇతర సభ్యులు హుస్సేన్‌ఆలంలోని బాబూ పూరణ్‌దాస్ మఠానికి వెళ్ళి దక్షిణ సమర్పించారు.

రాష్ట్రంలో 16 రోజుల మకాం తరువాత రాష్ట్రపతి జులై 9 వ తేది ఉదయం బయలుదేరి ఢిల్లీ వెళ్ళారు.

---

## * నాగార్జున సాగర్ ఆనకట్ట స్థలంవద్ద శిక్షణకేంద్రం *

[ ౨౫-వ పుట తరువాయి ]

ర్థులకు విషయాలు సులభంగా అర్థమగుటకు చార్టులు, దృశ్యగ్రాములు, నమూనాలు మున్నగు సాధనములు విరివిగా ఉపయోగించబడుతాయి. మిగిలిన వేళలలో వారికి మరమ్మతులు, ఓవర్‌హాల్ మున్నగు వాటిల్లో శిక్షణ ఇవ్వబడుతుంది. ఇందుకై పాత యంత్రములు ఉపయోగించబడుతాయి.

శిక్షణ పూర్తి అయిన తరువాత అభ్యర్థులకు ఒక సాంకేతిక పరీక్ష జరుపబడుతుంది. ఇందులో ఉత్తీర్ణులైనవారికి యోగ్యతా పత్రములు ఇవ్వబడుతాయి.



# వార్తా చిత్రాలు





రాష్ట్రపతి నిలయంలో గ్రంథపఠనంలో నిమగ్నులైయున్న రాష్ట్రపతి.

[దిగువ] రాష్ట్రపతి నిలయంలో అమర్చబడిన కొయ్యసామగ్రి. ఇది స్థానికంగానే తయారుచేయబడింది.





పడకగది

రాష్ట్రపతి నిలయమును అలంకరించడానికి ఉపయోగింపబడిన ఈ తెరలు స్థానికంగా తయారైనవి.



రాష్ట్రపతి దర్శనార్థం వచ్చువారు కూర్చునేగది.

రాష్ట్రవ్యవసాయమంత్రి యం. చెన్నారెడ్డి 1956 జూన్ 24వ తేదీన గుంగాలగ్రామంలో
శ్రీ రామకృష్ణ గ్రంథాలయానికి ప్రారంభోత్సవ చేశారు.



# మెదకు సామాజికాభివృద్ధి ప్రాంతంలో అభివృద్ధి



మెదక్ జిల్లాలో ప్రస్తుతం మూడుస్థలాలలోసామాజికాభివృద్ధి కార్యక్రమం చురుకుగా సాగుతున్నది. పటన్ చెరువు. వికారాబాదులలో సామాజికాభివృద్ధి కేంద్రాలు, సదాశివపేటలో ఒకజాతీయ వికాస కేంద్రం పనిచేస్తున్నవి.

పై ప్రాంతాల ప్రజలు ఉత్సాహంతో ముందుకువచ్చి ప్రాజెక్టు అధికారులకు సంపూర్ణసహకార మిస్తున్నారు. వికారాబాదులోని ప్రజలు రూ. ౧,౪౮,౮౯౩ లు సదాశివపేటలో రూ. ౧,౫౦,౦౦౦ లకు పైగాను, పటన్ చెరువులో రూ. ౨౫౦౦౦ ల విరాళాలు ఇచ్చారు.

వికారాబాదులోని సామాజికాభివృద్ధి కేంద్రంక్రింద ౧౩౩ గ్రామాలున్నవి. వీటి వైశాల్యం ౩౩౦ చ. మై. జనాభా ౮౭,౨౯౭.

ఈ కేంద్రంలో జరిగినకృషి వివరాలు ఇవి: ప్రజలచే క్రొత్తగా ౪ మైళ్ళ పొడవు రోడ్డు నిర్మించబడింది. కొత్తగా ౬౬౫ ఎకరాల భూమి సాగుక్రిందికి తీసుకొనిరాబడింది. దీనితో ఇప్పుడు సాగు అవుతున్న భూమి ౧,౬౫,౮౯౧ ఎకరాలు, ౨౭½ ఎకరాలలో ఫల వృక్షములు పెంచబడుతున్నవి. ౫౮ ఎకరాలలో కూరగాయలు పండించబడుతున్నవి.

సహకార సంఘాలు ౬౫, పంచాయితీలు ౧౦, వికాస మందిరములు ౧౨౫, యువజన వినోద కేంద్రాలు ౧౦, రైతుల సంఘాలు ౪, వయోజనవిద్యా కేంద్రాలు ౨౭, గ్రామ వినోద కేంద్రాలు ౮ తెరువబడినవి. సహకార సంఘాలలో క్రొత్తగా చేర్చుకోబడిన సభ్యుల సంఖ్య ౨౧౧౦.

క్రొత్తగా ౬ పాఠశాల భవనాలు నిర్మించబడినవి. వాటిలో విద్యార్థుల సంఖ్య ౩౬౨౪ నుంచి ౩౮౯౦ వరకు పెరిగింది. ఇప్పుడు వికారాబాదులో ఒక ప్రసూతి గృహం, గ్రామీణ ప్రాంతాలలో ౧౫ ఇండ్లు నిర్మించబడుతున్నవి. క్రొత్తగా ౩౬ బావులను త్రవ్వించుటకు, ౨౧ పాత బావులను మరమ్మతు చేయించుటకు రైతులకు తక్కావీగా రూ. ౨౮,౮౫౦ ల మొత్తం ఇవ్వబడింది. గత మూడు మాసాలలో రైతులకు ౧౫౬౦ మణుగుల విత్తనాలు, ౧౮౬౨ మణుగుల ఎరువులు, ౩౮ వ్యవసాయ పనిముట్లు పంచిపెట్టబడినవి. జపాను వరిసేద్య పద్ధతిని ప్రచారంలోకి తెచ్చుటకై ౨౬ ప్రదర్శనములు ఏర్పాటుచేయబడినవి.

పటన్ చెరువు కేంద్రంక్రింద ౧౦౨ గ్రామాలున్నవి. వీటివైశాల్యం ౩౧౨ చ. మై. జనాభా ౯౧,౩౪౩. ఇక్కడ ౨౨ మైళ్ళ కచ్చారోడ్డు, ౩½ మైళ్ళ పక్కా రోడ్డు నిర్మించబడినవి. గ్రామీణగృహములు ౩౧ నిర్మించబడినవి. ౬ పంచాయతులు, ౭౭ వికాస మందిరములు, ౭ యువజన వినోద కేంద్రాలు, ఒక రైతుల సంఘం, మహిళలకు మూడు వృత్తి పనుల కేంద్రాలు తెరువబడినవి. గత ఫిబ్రవరి మాసంలో గ్రామీణ కళలు, వృత్తి పనుల కేంద్రం ఒకటి నిర్వహింపబడింది. ఈ కేంద్రంలో ఉన్ని నేత, తోళ్లు పదునుచేయడం, తాటిబెల్లం ఉత్పత్తి మున్నగు విషయములలో శిక్షణ ఇవ్వబడింది.

ఈకేంద్రంలో ఇదివరకే రెండు అలోపతిక్ ఆసుపత్రులు, ఒక యునానీ ఆసుపత్రి పనిచేస్తున్నవి.

[తరువాయి ౩౬ వ పేజీలో]

# ప్రధాన్ పతకం బహూకరణ

౧౯౫౪ సం. ఫిబ్రవరి ౨౪ తేదీన సిటీ పోలీసు హెడ్ కాన్‌స్టేబుల్ అబ్దుల్ ఘని యను నాతడు కైలాస్ అను నొక హంతకునిచే కాల్చి చంపబడిన విషయమై విజయవంతంగా విచారణచేసి నేరస్థుని పట్టుకొనుటలో కృతకృత్యుడైన సిటీ పోలీసు, సి. ఐ. డి. నేరస్థ శాఖకు చెందిన అసిస్టెంటు పోలీసు కమీషనరు శ్రీ ఫ్రాంరోజ్ బొమాంజీ పటేల్‌కు ప్రధాన్ పతకం బహుమతిగా ఇవ్వబడింది. ఈ పోలీసు అధికారి హంతకుని పట్టుకొన్న వైనం ఇది——

సికింద్రాబాదు ప్రాంతంలో ఇండ్లల్లో దొంగతనాలు విపరీతంగా జరుగ నారంభించాయి. వాటివల్ల ప్రజల్లో చాలా అలజడి కలిగింది. శ్రీ ఫ్రాంరోజ్ పటేల్ వీటి ఆచూకీ తీసి, ఈ నేరాల కన్నింటికీ కైలాస్‌సింగ్ అను నాతడు బాధ్యుడని కనిపెట్ట గలిగాడు. ఆయన దోషిని పట్టుకొనుటకై ఎంతోమందిని నలుమూలల పంపించాడు. కైలాస్‌సింగ్ తరచుగా చిలకలగూడా ప్రాంతానికి వస్తూ వుంటాడని భావించినందువల్ల శ్రీ ఫ్రాంరోజ్ తిరుమల్‌గిరి పోలీసు స్టేషన్ హెడ్ కాన్‌స్టేబుల్ అబ్దుల్ ఘనీని దొంగను పసిపట్ట వల సిందిగా ప్రత్యేకంగా నియమించాడు. కైలాస్‌సింగ్, ఇందర్‌సింగ్ అను మరొక నేరస్థునితోపాటు ఒక స్మశానంలో ఉన్నట్లు వార్త తెలుసుకొని వారిద్దరినీ అరెస్టు చేయుటకై హెడ్‌కానిస్టేబుల్ పోలీసు కాని స్టేబుల్ అక్కడికి వెళ్ళారు. వారిద్దరు దగ్గరకు వెళ్ళ గానే కైలాస్‌సింగ్ రివాల్వరుతో హెడ్‌కానిస్టేబులును కాల్చి చంపివేసి అక్కడినుంచి సైకిలుపైన పారి పోయాడు. అయితే అతని అనుచరుడైన ఇందర్ సింగ్‌ని మాత్రం పట్టుకొని అరెస్టుచేయ గలిగారు.

శ్రీ ఫ్రాంరోజ్ బొమాంజీపటేల్

## హంతకునికై గాలింపు

పోలీసులు ఇందర్ సింగ్‌ను నిర్బంధంలో ఉంచి వానిద్వారా కైలాస్‌సింగ్ ఉనికిని తెలుసుకోగలిగారు కైలాస్ సరస్వతి అను ఒక ఉంపుడు కత్తెతో భోయిగూడలో సాన్నా అను ఒక క్రైస్తవుని ఇంటిలో నివసిస్తున్నట్లు ఇందర్‌సింగ్ తెలిపాడు. అదేరోజు రాత్రి పోలీసులు ఈ ఇంటిపై దాడిచేశారు. అంతకు ౭, ౮ గంటలకు ముందుగానే కైలాస్ తన ఉంపుడు కత్తెతోపాటు ఎక్కడికో వెళ్లిపోయాడని తెలిసింది. ఈ ఎనిమిదిగంటలకాలంలో కైలాస్ అన్నివిధాలా పోలీసులను మభ్యపెట్ట ప్రయత్నించినాడని తరువాత తెలిసింది. అతను ఏవైపు ఎక్కడికి వెళ్ళిందీ పోలీసులు గట్టిగా ఆరా తీశారు. కైలాస్, అతని ఉంపుడుగత్తె ఒక టాంగాలో భోయిగూడనుంచి ఎక్కడికి వెళ్లారో తెలియదు. వాళ్ళను తీసుకొని వెళ్ళిన టాంగావాలా ఎవ్వరో శ్రీ పటేల్ అతికష్టంమీద కనుక్కో గలి

[తరువాయి ౩౪ వ పేజీలో]

# పత్రికలలో తప్పుడువార్త: కళాశాలకు భూరివిరాళం



పత్రికలలో పొరపాటున ఒకవార్త పడింది. ఫలితంగా ఖమ్మంలో కళాశాలస్థాపనకొరకై ఒకలక్షరూపాయల విరాళం స్వచ్ఛందంగా లభించింది.

ఖమ్మంలో కళాశాలను స్థాపించడానికై రూ. 50 వేలు విరాళమివ్వడానికి భక్తరామదాసు భద్రాచలేశ్వరునికి చేయించిన పచ్చల పతకాన్ని అమ్మవలెనని భద్రాచలం దేవస్థానం కమిటీ ప్రయత్నిస్తున్నదని కొన్ని పత్రికలలో ఒకవార్త వెలువడింది. తరువాత ఈవార్త నిరాధారమని ఖండింపబడినది. కాని ఆవార్త విన్నవెంటనే కృష్ణాజిల్లా, తక్కెళ్ళపాడు గ్రామ వాస్తవ్యులు శ్రీ గెంట్యాల నారాయణరావు గారు పచ్చలపతకం అమ్మకాన్ని ఆపివేయించాలని నిర్ణయించారు. కళాశాల స్థాపకులలో ముఖ్యులైన శ్రీ బొమ్మకంటి సత్యనారాయణ గారిని, ఖమ్మంజిల్లా కలెక్టరును ఆయన కలుసుకొని పచ్చలపతకాన్ని అమ్మవద్దనీ, కళాశాలకు తాము ఒకలక్షరూపాయల విరాళం ఇస్తామని వాగ్దానంచేశారు. తక్షణమే రూ. 30,000ల నగదు చెల్లించారు. మిగతాడబ్బు వాయిదాల వారీగా చెల్లించబడుతుంది. పచ్చలపతకం అమ్మకం తలపెట్టబడలేదనీ, కళాశాల స్థాపన కొరకు సెక్యూరిటీ డిపాజిట్ నిలువలనుంచి



శ్రీ గెంట్యాల నారాయణరావు

రూ. 50,000లు గానీ, లేక అందులో తగు మొత్తాన్నిగాని చెల్లించడానికి దేవస్థానం కమిటీ ప్రభుత్వానికి సిఫారసుచేసిందని శ్రీ నారాయణరావుగారికి తెలియజేయబడింది.

ఈవిధంగా భద్రాచలేశ్వరుని కృపవల్లను, ఆయన భక్తుని సహృదయతవల్లను జులై 14 వ తేదీన ముఖ్యమంత్రిగారిచే ప్రారంభోత్సవం

చేయబడిన ఖమ్మంకళాశాల చక్కని పునాదులపై, శుభప్రదమైన నాందితో ఆరంభమవుతున్నది. ఇంతవరకు ఈ కళాశాలకొరకు వసూలైన మొత్తం వాగ్దానాలు కలిపి రూ. 2½ లక్షలవరకు వుంటాయి. కళాశాలకు "శ్రీరామ భక్త గెంట్యాల నారాయణరావు సైన్సు, ఆర్ట్సు కాలేజీ" అని పేరు పెడతారు.

హైద్రాబాదులో ఈసంవత్సరం ఏర్పాటు చేయబడుతున్న ఎనిమిది కళాశాలల్లో ఇది ఒకటి. పై ఎనిమిది కళాశాలల్లో ఔరంగాబాదు వైద్యకళాశాల, మరాట్వాడాలో వ్యవసాయకళాశాల, మోమినాబాదు, నల్లగొండ కరీంనగర్, ఖమ్మం, హైద్రాబాదునగరంలలో కొత్తగా స్థాపించబడు ఆర్ట్సు, సైన్సు కళాశాలలు కలవు. ఈ కళాశాలలస్థాపనతో రాష్ట్ర విద్యాచరిత్రలో ఒకనూతనదశ ఆరంభమవుతున్నది.



## మెదకు సామాజికాభివృద్ధి ప్రాంతంలో అభివృద్ధి

( ౩౩-వ పుట తరువాయి )

వీటికి తోడుగా శంకరంపల్లిలో క్రొత్తగా మరొక ఆసుపత్రి నిర్మింపబడుతున్నది. ప్రసూతి మరియు ఆరోగ్య కేంద్రాలను నడుపుటకు మూడు గ్రామాలు ఎన్నుకోబడినవి. పటన్‌చెరువు కేంద్రంలో ఇప్పుడు ౯౧ పాఠశాలలున్నవి. ఇందులో విద్యార్థుల సంఖ్య ౫౫౧౫. ఇంతేగాక ౨౫ వయోజన విద్యా కేంద్రాలు, ౧౧ వినోద కేంద్రాలు, ౨ గ్రంథాలయాలున్నవి.

ఈ కేంద్రం అధికారులు ౩౨ పక్కా బావులు త్రవ్వించుటకు, ౧౭ పాతబావులను మరమ్మతు చేయుటకు, రైతులకు రూ. ౩౫౦౦౦ ల మేరకు అప్పులిచ్చారు. ౬౦ ఎకరాల భూమిలో కూరగాయలు పండించబడుతున్నవి. రైతులకు ౭౦౪ మణుగుల ఎరువులు, ౧౮౮౧ మణుగుల విత్తనాలు పంచిపెట్టబడినవి. వరి, చెరకు, ఉల్లిగడ్డలు పండించుటకు అభివృద్ధికర పద్ధతులను ప్రచారంలోకి తెచ్చుటకై ౪౯ ప్రదర్శనములు ఏర్పాటుచేయబడినవి.

సదాశివపేట జాతీయ వికాసకేంద్రంక్రింద ౧౧౫ గ్రామాలున్నవి. వీటి వైశాల్యం ౩౩౭ చ. మై. జనాభా ౯౦,౪౪౯. ప్రస్తుతం ౯౧ గ్రామాలలో పని ఆరంభించబడింది. వాటిలో ౧౧౩౨౦ కుటుంబాలున్నాయి. ౨౯౪౦ కుటుంబాల రైతులు అభివృద్ధికర పద్ధతులలో సేద్యం చేస్తున్నారు. ౧౪౨౦ కుటుంబాల వ్యక్తులు విద్యాసౌకర్యాలవల్ల సంపూర్ణంగా లాభం పొందుతున్నారు. ౪౪౨` కుటుంబాలు సహకార సంఘాలలో చేరినవి.

ఇంతవరకు రైతులకు ౩౯౭౦ మణుగుల ఎరువులు, ౬౫౧ మణుగుల మేలురకం విత్తనాలు పంచిపెట్టబడినవి. ౨౯ ఎకరాలలో ఫలవృక్షాలు పెంచబడుతున్నవి. ౩౨ ఎకరాలలో కూరగాయలు పండించబడుతున్నవి. మేలురకం పద్ధతిలో వ్యవసాయం చేయుటను ప్రచారంలోకి తెచ్చుటకై వివిధ గ్రామాలలో ౫౭ ప్రదర్శన సేద్యభూములు నెలకొల్పబడినవి. ౩౨౭౫ కంపోస్టు గుంటలు త్రవ్వబడినవి. ౮౦౦ గజాల పొడవున మురుగు గుంటలు నిర్మించబడినవి.

సదాశివపేట కేంద్రంలో ఇప్పుడు ౭౩ సహకార సంఘా లున్నవి. వీటి సభ్యుల సంఖ్య ౩౯౧౪. ఈ సంఘాలమూలధనం రూ. ౩,౨౫,౦౦౦ లున్నది. సేద్య కాలంలో పనులుజరుగుటకై రైతులకు ౧,౧౭,౫౨౦ల మేరకు స్వల్పకాలిక ఋణము లివ్వబడినవి.

కొత్తగా పాఠశాలలు, ౨౮ వయోజన కేంద్రాలు నెలకొల్పబడినవి. వీటిల్లో చదువుకొంటున్నవారి సంఖ్య ౪౯౦. ఇంతేగాక ౨౪ వినోద కేంద్రాలు కూడ నిర్వహించబడుతున్నవి.



# హైదరాబాదు డైరీ

★

## జూన్ 1956

1. రూ. 2 కోట్ల ఖర్చుతో సెక్రటేరియట్ భవనములు, శాసనసభాభవనం, శాసనసభ్యులకు ప్రభుత్వోద్యోగులకు ఇండ్లు నిర్మించడానికై హైద్రాబాదు ప్రభుత్వం తాత్కాలికంగా తయారుచేసిన పథకాన్ని జూన్ 14 వ తేదీన ఆంధ్ర, హైద్రాబాదు ప్రభుత్వాలు సంయుక్తంగా మంత్రివర్గస్థాయిపై చర్చింపగలవని ప్రకటించబడింది.

2. జూన్ 9 వ తేదీన హైదరాబాదులో జరిగే అఖిల భారత యువజనమహాసభకు కాంగ్రెసు అధ్యక్షుడు శ్రీ యు. యన్. ఢేబర్ ప్రారంభోత్సవం చేస్తారనీ, ఈ మహాసభకు దాదాపు వెయ్యిమంది ప్రతినిధులు రాగలరనీ ప్రకటించబడింది.

3. హైద్రాబాదురాష్ట్ర రోడ్డు రవాణా పనివారల నాల్గవ వార్షిక సర్వసభ్య సమావేశంలో శ్రీ రాఘవేంద్రరావు దేశాయిని నూత్న అధ్యక్షులుగా ఎన్నుకొన్నారు. వచ్చే సంవత్సరానికి ఇతర అధికారసభ్యులుకూడా ఈ సమావేశంలో ఎన్నుకోబడ్డారు.

4. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ కార్యాలయములను ఉద్యోగులకు ఇండ్లను నిర్మించే కార్యక్రమాన్ని హైద్రాబాదు ప్రభుత్వ ప్రతినిధులతో చర్చించడానికై జూన్ 14, 15 తేదీలలో ఆంధ్రముఖ్యమంత్రి, ఉపముఖ్యమంత్రి ఇతర ఉన్నతాధికారులు హైద్రాబాదు విచ్చేయగలరని ప్రకటింపబడింది.

5. ఔరంగాబాదు పాలీటెక్నిక్ నూత్నభవనానికి రాష్ట్ర ముఖ్యమంత్రి డా. బి. రామకృష్ణారావుగారు శంఖుస్థాపన చేశారు. ఔరంగాబాదు నీటిసరఫరా ఏర్పాటుకుకూడా ముఖ్యమంత్రి ప్రారంభోత్సవం సల్పారు.

6 1956 సం.పు హైద్రాబాదుసాధారణ అమ్మకపుపన్ను (సవరణ) బిల్లుకు రాష్ట్రపతి తమ ఆమోదం తెలిపారు.

7. హైద్రాబాదు రాష్ట్రాన్ని విభజించి, విభజింపబడిన మూడుప్రాంతాలను ఆయా భాషాప్రాంతాలతో విలీనం చేయడానికిగాను సంప్రదింపులు జరుపడానికై నాలుగు రాష్ట్రాలకు ప్రాతినిధ్యం వహించే అంతర్రాష్ట్రీయ సంఘమును నెలకొల్పవలసిందని సూచిస్తూ తాము ఆంధ్ర, మైసూరు, బొంబాయిరాష్ట్రాల ముఖ్యమంత్రులకు వ్రాసినామని హైద్రాబాదు ముఖ్యమంత్రి వెల్లడించారు.

8. మునిసిపల్ కార్పొరేషను ఎన్నికలకు కాంగ్రెసు పార్టీ ఎన్నికలప్రణాళికను నగరకాంగ్రెసు కమిటీ అధ్యక్షుడు పత్రికా విలేఖరులగోష్ఠిలో వెలువరించారు.

9 ఉస్మానియా విశ్వవిద్యాలయంలో అఖిలభారత యువజనమహాసభ ప్రథమ సమావేశాన్ని కాంగ్రెసు అధ్యక్షుడు శ్రీ ఢేబర్ ప్రారంభిస్తూ కులతత్వాన్నీ, అసాంఘిక, ప్రజాస్వామ్య వ్యతిరేకశక్తులనూ ప్రతిఘటించడానికి ఒక కార్యక్రమాన్ని తలపెట్టవలసిందిగా యువకులను ప్రబోధించారు.

10. రాష్ట్రంలోని వివిధ చేతిపరిశ్రమలకు సహాయంచేసే ఉద్దేశంతో కుటీరపరిశ్రమలకొరకు ఒక మ్యూజియమును, ఒక కేంద్ర డిజైనులసంస్థను స్థాపించ హైద్రాబాదు ప్రభుత్వం తలపెట్టిందని ప్రకటించబడింది.

11. "పంచశీల" సూత్రాలను ఆమోదించే దేశాలన్నింటితో భారతదేశంలో ఒక సభ జరుపబడవలెనని సూచిస్తూ అఖిల భారత యువజన మహాసభలో ఆ మహాసభతాలూకు ప్రపంచవ్యవహారాలసంఘం ప్రతిపాదించిన తీర్మానం ఆమోదింపబడింది.

12. హైద్రాబాదు ప్రభుత్వం తన గెజిటెడ్ అధికారులను ఆంధ్ర, మహారాష్ట్ర మైసూరు రాష్ట్రాలకు వరుసవారీగా 60, 25, 15 నిష్పత్తిప్రకారం పంపిణీచేసేపనిని పూర్తిచేసిందని ప్రకటింపబడింది.

13. హైద్రాబాదు కర్ణాటక కాంగ్రెసు ప్రతినిధులు, పార్లమెంటుసభ్యులు, శాసనసభ్యులు, గుల్బర్గా, రాయచూరు, బీదరు జిల్లాల కాంగ్రెసు కమిటీల అధ్యక్ష కార్యదర్శులు గాంధీభవన్‌లో సమావేశమై మైసూరు ముఖ్యమంత్రి ఏర్పాటుచేసిన అంతరాష్ట్ర సంఘానికి శ్రీ జి. అన్నారావును ఎన్నుకున్నారు.

14. హైద్రాబాదుకు తరలింపబడు ఆంధ్రప్రభుత్వ కార్యాలయములకు, ఉద్యోగులకు గృహవసతి కల్పించే విషయాన్ని చర్చించే సందర్భంలో ఆంధ్ర హైద్రాబాదు రాష్ట్రాల ముఖ్యమంత్రులు హైద్రాబాదు సికింద్రాబాదు నగరాలలోని వివిధప్రాంతాలను చూచారు.

15. ఆంధ్రప్రదేశ్ నూత్నకార్యాలయాలకు భవనములను నిర్మించడానికై తలపెట్టబడిన ఒక కోటిరూపాయల ప్రణాళిక

ఆంధ్ర, హైద్రాబాదు మంత్రుల సమావేశంలో ఆమోదింప బడింది.

16. ఆంధ్రప్రదేశ్ రాజధానిలో తక్షణమే నిర్మింపబడ వలసివున్న భవనముల ఖర్చును భరించడానికై అప్పు ఇవ్వ వలసిందిగా కేంద్రప్రభుత్వాన్ని కోరడమవుతుందని అధి కారికంగా వెల్లడించబడింది.

17. ఆంధ్రవిద్యాశాఖ డైరెక్టరు శ్రీ డి. యస్. రెడ్డి హైద్రాబాదులో ఒక సందర్భంలో ప్రసంగిస్తూ వచ్చే అక్టో బరులో హైద్రాబాదు నగరానికి వచ్చే ఆంధ్ర ప్రభుత్వో ద్యోగుల పిల్లలకు ప్రవేశం కల్పించేందుకై ఇక్కడి వివిధ కళాశాలలలోని సీట్లసంఖ్య తగువిధంగా హెచ్చింపబడగల దని తమకు తెలియజేయబడిందని వెల్లడించారు.

18. హైద్రాబాదు కళాశాలలలో వెనుకబడిన తరగతుల విద్యార్థులకొరకు ఇంతకుమునుపటివలె 16 శతికి బదులుగా 30 శతి సీట్లను కేటాయించడానికి ప్రభుత్వం నిర్ణయించిందని హైద్రాబాదు విద్యామంత్రి వెల్లడించారు.

19. రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణదృష్ట్యా ఒకచోటనుంచి మరొకచోటుకు తరలించదగు యంత్రపరికరములను రాష్ట్రంలోని ఒకప్రాంతంనుంచి మరొకప్రాంతానికి తరలించ రాదని రాష్ట్రప్రభుత్వం అన్నిశాఖల అధిపతులకు, కార్య దర్శులకు ఆదేశంపంపింది.

20. హైద్రాబాదులో వేదాంతవర్ధినీ కళాశాలకు డా. బి. రామకృష్ణారావుగారు ప్రారంభోత్సవం చేశారు.

21. ఆంధ్ర-హైద్రాబాదుల విలీనీకరణ జరుగనున్నది గనుక ఈ ఉభయరాష్ట్రాలలో అమలులోనున్న శాసనాలను సమన్వయ పరచడానికై ప్రత్యేకంగా ఒకసంఘం నియమిం పబడుతుందని ఆంధ్రప్రభుత్వ న్యాయశాఖకార్యదర్శి హైద్రా బాదులో తెలియజేశారు.

22. ఆంధ్ర - హైద్రాబాదు రాష్ట్రాల విలీనీకరణ తరు వాతకూడా ఆంధ్ర, తెలంగాణా ప్రాంతాల భూవిధానం, రెవిన్యూ పరిపాలన ఏకరీతిగా రూపొందునంతవరకు ఉభయ ప్రాంతాలకు విడివిడిగా రెవిన్యూబోర్డులు ఉండవచ్చునని ఆంధ్ర రెవిన్యూమంత్రి శ్రీ కె. చంద్రమౌళి తెలియచేశారు.

23. భారతఅధ్యక్షులు డా. రాజేంద్రప్రసాద్ రాష్ట్రపతి నిలయంలో మూడువారాలపాటు మకాంచేయుటకై హైద్రా బాదు విచ్చేశారు.

24. "హమారా ఏక్దాం" పత్రిక సంపాదకులు ఆబిద్ జైనులాబద్దీన్ నగరంలో రిక్షాలో పోతూవుండగా అరెస్టు చేయబడినాడు. ఈయన అరెస్టువిషయమై ప్రభుత్వం లోగడ ఒక ప్రకటనచేసివున్నది.

25. యావదాంధ్రమున కుపయోగపడునట్లుగా హైద్రా బాదు రేడియోస్టేషనులో 10 కిలోవాట్ల షార్టు వేవ్ ట్రాన్స్ మిటర్ స్థాపించబడగలదని కేంద్రప్రభుత్వ సమాచారప్రచార శాఖలమంత్రి ఇక్కడ తెలియజేశారు.

26. ఉభయనగరముల మునిసిపల్ కార్పొరేషనులకు కౌన్సిలర్లను ఎన్నుకొనడానికై హైద్రాబాదు - సికింద్రా బాదు నగరముల పౌరులు పోలింగు కేంద్రములకు వెళ్ళి వోట్లు వేశారు.

27. నాగార్జునసాగర్ ఆనకట్టకు హైద్రాబాదువైపున యూనియన్ప్రభుత్వ నీటిపారుదల, విద్యుచ్ఛక్తి శాఖల మంత్రి శ్రీ జైసుఖ్లాల్హాతీ భారీయంత్రముల శిక్షణ కేంద్రానికి ప్రారంభోత్సవంచేశారు.

28. సికింద్రాబాదు మునిసిపల్ కార్పొరేషనులోని 28 సీట్లకుగాను 18 సీట్లను కాంగ్రెసుపార్టీ గెలుచుకొని పూర్తి మెజారిటీ సంపాదించిందని ప్రకటింపబడింది.

29. హైద్రాబాదు మునిసిపల్ కార్పొరేషనులోని 66 సీట్లలో కాంగ్రెసుపార్టీ 44 సీట్లను గెలుచుకొన్నది.

30. భారత అధ్యక్షులు డాక్టరు రాజేంద్రప్రసాద్ బీదరు సందర్శించి వివిధచారిత్రక స్థలాలను చూచారు.



# హైదరాబాదులో పునరావాస సంక్షేమ కార్యక్రమములు

హైదరాబాదు ప్రభుత్వ సాంఘిక సేవాశాఖ నిమ్న జాతులు, కొండజాతులు, విమోచిత జాతులు, తదితర వెనుకబడిన జాతుల శ్రేయస్సు కొరకై పనిచేస్తున్నది. ఈశాఖ నిస్సహాయులైన పిల్లలను అనాధులను, బాల నేరస్థులను, పతితలను, పతితులైన బాలికలను, భౌతికంగా నైతికంగా నిస్సహాయ స్థితిలోవున్న వర్గాల వారిని సన్మార్గంలో పెట్టి వారికి యధారీతిగా పునరావాసం కల్పించడానికి కృషిచేస్తుంది.

నిమ్నజాతుల విద్యార్థులకు వారి విద్యాభ్యాసపు అన్ని దశలలోను ఉపకార వేతనములు ఇవ్వబడుతాయి. వారికి వసతి గృహపు సౌకర్యాలు కూడా కలుగజేయ బడుతాయి. ఈ సౌకర్యాలు ప్రత్యేక స్కాలర్ షిప్ బోర్డుద్వారా ఏర్పాటు చేయబడుతాయి. ఇందుకొరకై గత సంవత్సరం రూ. 24 లక్షలు మంజూరు చేయబడగా ప్రస్తుత సంవత్సరం రూ. 24, 20, 275 లు మంజూరు చేయబడినవి.

ప్రత్యేక కార్యక్రమం క్రింద హరిజనులకు రూ. 9, 40, 949 ల వ్యయంతో గృహవసతి, కుటీరపరిశ్రమలు, సహకారంమొదలగుఅనేకసౌకర్యములు కల్పించబడుతాయి.

కొండజాతులు, విమోచిత జాతుల శ్రేయస్సు కొరకై అనేక పథకములు ప్రారంభింపబడుతున్నవి. విద్యావ్యాప్తి కొరకై కొండజాతులకు 158 పాఠశాలలు, మూడు వసతి గృహములు, 4 ఉపాధ్యాయుల శిక్షణ కేంద్రములు, విమోచిత జాతుల కొరకు 47 పాఠశాలలు, 2 శిక్షణ కేంద్రములు ఈ శాఖచే నడుపబడుతున్నవి. వారికి ఆరోగ్య, గృహవసతి, వ్యవసాయ సౌకర్యాలు కూడా కల్పించబడుతున్నవి. పొలందున్నే ఎద్దులు, విత్తనాలు, వ్యవసాయ పనిముట్లు సరఫరా చేయబడుతున్నవి. మన్నానూరులో సహకార క్షేత్రం, ఆదిలాబాదులో ప్రదర్శనక్షేత్రం స్థాపించబడినవి. కొండజాతుల శ్రేయస్సు కొరకు తలపెట్టబడిన పథకానికి రూ. 5,06,450 లు, విమోచిత జాతుల కొరకు తలపెట్టబడిన పథకానికి రూ. 1,92,155 లు ఈ సంవత్సరం ఖర్చు అవుతాయి.

తాత్కాలికంగా 129 కులాలవారిని వెనుకబడ్డ తరగతులుగా నిర్ణయించడమైనది. వీరి అభ్యున్నతి కొరకై ఉపకార వేతనములు, వసతి గృహములు, వృత్తి సహాయం మున్నగు వాటి రూపంలో సహాయపడడానికై రూ. 2,74,259 లు ప్రస్తుత సంవత్సరపు బడ్జెటులో కేటాయించబడినవి.

పేదవర్గములవారి అభ్యున్నతి కొరకై బిచ్చగాండ్రకు పౌర గృహములు, వెనుకబడిన తరగతులవారికి కాస్మాపొలిటన్ వసతిగృహం, ప్రతి జిల్లా కేంద్రంలో హరిజనులకు వసతి గృహములు, బాలనేరస్థులకు ఉద్ధారక గృహములు సాంఘిక సేవా శాఖచే నిర్వహింపబడుతున్నవి.

పేదవర్గములు, నిర్లక్ష్యం చేయబడిన ప్రాంతములు, సంఘంలో హీనదశలో వున్న వర్గములు, భౌతికంగా, నైతికంగా నిస్సహాయస్థితిలో ఉన్నవారి అభ్యున్నతి కొరకై సాంఘిక సేవాశాఖ చేసిన కృషి ఎన్నదగినది. ఈవిషయమై ప్రభుత్వం చేసిన వివిధ శాసనములను విభిన్న పరిస్థితులకు అనుగుణమైన రీతిగా అమలు పరచడం జరుగుతున్నది.

## కార్మిక సంక్షేమం

బియ్యం, పిండి, పప్పు మరలలోను, నూనె మిల్లులలోను పనిచేయు వారలకు, బీడీల పనిచేయు వారికి, రోడ్ల నిర్మాణం భవనముల నిర్మాణం, రాళ్లు పగులగొట్టడంలో పనిచేయువారికి మూడు జిల్లాలలో వ్యవసాయపు పనులు చేయువారికి కనీస వేతనములు ఇదివరకే నిర్ణయింప బడినవి. ప్రత్తి ఏకుడు, వత్తుడు పనివారలకు కనీస వేతనములు సిఫారసు చేయబడినవి.

142 ప్రాణహానికరమైన సందర్భాలు తదితర సందర్భాలకుగాను 114 సందర్భాలలో ఇవ్వవలసిన పరిహారమును కార్మికుల పరిహారపు కమీషనర్ పరిష్కారం చేసినాడు. మొత్తం రూ. 1,68,345-4-0 ల పరిహారం ఇవ్వబడింది.

చనిపోయిన కార్మికుల తాలూకు వాటాలను స్థిరాస్తులలోను, తపాలా సేవింగ్సు బ్యాంకులోను పెట్టుబడి పెట్టడం ద్వారా కమీషనరు ఆ కార్మికులపై ఆధారపడి వున్నట్టి

వ్యక్తులకు సహాయపడినాడు. పెండ్లిండ్ల కొరకు, వ్యాపారాలు పెట్టుకోవడానికి సహాయం చెయ్యబడింది. ఇది సాధ్యంకాని సందర్భాలలో త్రైమాసిక కిస్తుల రూపంలో డబ్బు చెల్లింపు జరిగింది. ఈ చెల్లింపు మనియార్డరుల ద్వారా జరిగింది.

ఐక్యరాజ్య సమితి తాలూకు సంస్థవారు ఉచితంగా సరఫరా చేసిన పాలను కార్మికుల పిల్లలకు పంపిణీ చేయడమైనది.

74 సందర్భాలలో ప్రసూతికిపోవు స్త్రీలకు రూ. 3,259-2-3 లు చెల్లించబడినవి.

ఆజమాబాదులో, లాతూరులో రెండు కార్మిక సంక్షేమ కేంద్రాలు ఏర్పాటుచేయబడినవి. ఈ కేంద్రాలలో ఇంటా బయటా ఆడే ఆటలు, వయోజన విద్యాతరగతులు పెట్టబడినవి. ఆజమాబాదు కేంద్రంలో సమాచార పౌరసంబంధముల శాఖవారు విద్యావిషయికమైన చలన చిత్రములు చూపెట్టినారు. ఫ్యాక్టరీల యజమానులు ఇచ్చిన విరాళాలతో జాల్నాలో 1956 ఏప్రిల్ 12 తేదీనుంచి ఒక సంక్షేమకేంద్రం ప్రారంభింప బడింది. 1956 జనవరిలో యాదగిరిలో హైదరాబాదు ప్రభుత్వ కార్మికశాఖ మంత్రి ఒక సంక్షేమ కేంద్రాన్ని ప్రారంభించారు. ఈకేంద్రం దుకాణదారుల, గుమాస్తాల సంయుక్త కృషితో తెరువబడింది. దీనిలో పఠనాలయం నెలకొల్పవలెనని మొదట తలపెట్ట బడింది. కాని పఠనాలయంతోపాటు దీనిలో ఒక రేడియోసెట్టు కూడా పెట్టబడింది. గృహ క్రీడలకు కూడా ఇచట ఏర్పాట్లు చేయబడినవి.

హట్టీ బంగారుగనుల కార్మికులపై ఆధారపడివున్న వ్యక్తులకు చరఖా వడుకు తరగతులు ప్రారంభింప బడినవి. ఈ శాఖ అధికారుల కృషివల్ల ఔరంగాబాదు మిల్సులో ఉద్యోగుల సహకార పరపతి సంఘములు నెలకొల్పబడినవి. ఔరంగాబాదులో మునిసిపల్ కార్మికుల కొరకై ఒక ధాన్యం అంగడి, ఒక సహకార పరపతి సంఘం ఏర్పాటు చేయబడినవి.

ట్రేడ్‌యూనియనుల చట్టము ననుసరించి 34 కార్మిక సంఘములు రిజిష్టరు చేయబడినవి. వీనిలో 2,715 మంది సభ్యులున్నారని చెప్పబడుతున్నది. అయిదు యజమానుల సంఘములు కూడా కలవు. వీనిలో 164 మంది సభ్యులున్నారు.

## స్థానభ్రష్టులైన వ్యక్తులకు పునరావాసం

హైదరాబాదులో పోలీసుచర్య తరువాత పునరావాస సమస్యకూడా ప్రభుత్వాన్ని ఎదుర్కొన్నది. స్థానభ్రష్టులైన వారికి సహాయ నిమిత్తం ప్రభుత్వం అమలుపరచిన వివిధ పథకముల మూలకంగా ఈసమస్య త్వరగా పరిష్కారమై పోయింది. స్టైపెండులు, ఉపకార వేతనములు, వితంతు స్త్రీలకు పింఛనులు, ఇండ్లు కట్టుకోవడానికి కలప సామగ్రి వగైరాల రూపంలో ప్రభుత్వ సహాయం అందజేయబడింది. ఒక వర్గమునకుచెందిన వారి ఆస్తులను మరొక వర్గంవారు 400 సందర్భాలలో దురాక్రమణచేయడం జరుగగా ప్రభుత్వం అట్టి కేసులను సముచితంగా పరిష్కరించింది.

ఇంత జరిగినప్పటికీ జిల్లాలోని కొన్ని ప్రాంతాలలో ముఖ్యంగా మరాట్వాడా, కర్నాటక జిల్లాలలో మరికొన్ని పునరావాస చర్యలు అవసరమని అచటి అధికారులు, అనధికారులు భావించారు. అయితే రాష్ట్రి బడ్జెట్టులో కొరత వున్నందువల్ల సాంఘిక పునరావాస సంఘ సభ్యులు తలపెట్టిన వివిధ పథకాలను అమలు పరచడానికై ఆర్థిక సహాయం చేయవలసిందిగా కేంద్ర ప్రభుత్వాన్ని కోరడమైనది. భారతప్రభుత్వం తాత్కాలికంగా రూ. 5 లక్షల గ్రాంటు మంజూరుచేసింది. బీదరు, ఉస్మానాబాదు, గుల్బర్గా నాందేడు జిల్లాలలో ఈ దిగువ సహాయకచర్యలు గైకొనబడినవి. ఈ జిల్లాలలో జరిగిన దురాక్రమణల విషయం విచారణ జరుపబడి ఎక్కువ కేసులలో ఈ క్రిందివిధంగా పరిష్కారం కుదర్చబడింది:—

(అ) వితంతు పింఛనులు

| జిల్లా | | | మంజూరు చేయబడిన పింఛనుల సంఖ్య |
|---|---|---|---|
| 1. బీదరు | .... | .... | 865 |
| 2. ఉస్మానాబాదు | .... | .... | 733 |
| 3. నాందేడు | .... | .... | 100 |
| 4. గుల్బర్గా | .... | .... | 101 |
| 5. హైద్రాబాదు | .... | .... | 13 |
| | | | 1812 |

(ఆ) విద్యార్థుల స్టైపెండ్లు

| | | | |
|---|---|---|---|
| 1. బీదరు | .... | .... | 638 |
| 2. ఉస్మానాబాదు | .... | .... | 447 |
| 3. హైద్రాబాదు | .... | .... | 2 |
| | | | 1087 |

(ఇ) వివాహములకు సహాయం

| | | | |
|---|---|---|---|
| 1. బీదరు | .... | .... | 25 |
| 2. ఉస్మానాబాదు | .... | .... | 15 |
| | | | 40 |

(ఈ) విరుద్ధమైన ఆక్రమణలు జరిగిన కేసులు

| | ఉస్మానాబాదు | బీదరు | గుల్బర్గా |
|---|---|---|---|
| 1. పరిష్కరింపబడిన కేసులు | 509 | 461 | 140 |
| 2. సివిల్ న్యాయస్థానాలచే నిర్ణయించబడిన కేసులు | 23 | 20 | |
| 3. సివిల్ న్యాయస్థానములచే నిర్ణయించబడవలసిన కేసులు | 135 | 128 | 104 |
| 4. విచారణ జరగవలసిన కేసులు | | 1 | 4 |
| మొత్తం | 667 | 610 | 248 |

(Row 3 also shows "—" above the గుల్బర్గా value.)

చివరిదశలో పై పథకములు మరాట్వాడా ప్రాంతంలోని మరికొన్ని జిల్లాలకు విస్తరింప జేయబడినవి. మరికొంత ధన సహాయం చేయవలసిందిగా భారత ప్రభుత్వాన్ని కోరడ మయినది. భారత ప్రభుత్వంవారిప్పుడు రూ. 13.50 లక్షలు మంజూరుచేశారు. కనుక ఈ ప్రాంతంలో పునరావాస కార్య కలాపాలు చురుకుగా సాగుతున్నవి.

పై కార్యక్రమములేగాక పాకిస్తానునుంచి వచ్చిన నిర్వాసితులకు ఆవాసం కల్పించవలసిన సమస్య సాంఘిక సేవా శాఖను ఎదుర్కొన్నది. నిజామాబాదు జిల్లాలోని కోస్లి గ్రామానికి సమీపానగల ప్రదేశంలో దాదాపు 29 కుటుంబాలకు ఆవాసం కల్పించబడింది. భారత ప్రభుత్వం ఆదేశించిన ప్రకారం ఆ కుటుంబాలవారికి అన్ని సౌకర్యములు సమకూర్చబడినవి. తమకై తాముగా హైదరాబాదు సికింద్రాబాదు నగరాలలోను, జిల్లాలలోను ఆవాసం కల్పించుకున్న నిర్వాసిత కుటుంబాలకుకూడా విద్య, తదితర సౌకర్యములు ఏర్పాటు చేయబడినవి. ఆస్తిపై హక్కులను చెప్పుకోజాలనట్టి నిర్వాసిత వ్యక్తులకు వ్యాపారాలు పెట్టుకోడానికి, పరిశ్రమలు స్థాపించుకోవడానికి ఋణములు ఇవ్వబడినవి. వారిపిల్లలకు పాఠశాలల్లో, కళాశాలల్లో చదువుకోవడానికి ఆర్థిక సహాయం చేయబడింది. నిరూపితమైన హక్కులు గల నిర్వాసిత వ్యక్తులకు బొంబాయిలోని భారతప్రభుత్వ పునరావాస మంత్రిత్వ శాఖయొక్క ప్రాంతీయ సెటిల్మెంట్ కమీషనరుచే రాష్ట్రంలోని భవనములు, కాందిశీకులై వెళ్ళిపోయిన వారి భూములు కేటాయింపు చేయబడినవి. ★

---

ప్రధాన్ పతకం బహూకరణ [ ౩౪-వ పుట తరువాయి ]

గాడు. టాంగావాడు కైలాస్‌ను, సరస్వతిని కాచిగూడ రైల్వే స్టేషన్‌వద్ద విడిచిపెట్టాడని తెలిసింది. ఆయన తిరిగి కాచిగూడలో గట్టిగా విచారించగా హంతకుడు అక్కడినుంచి ఒక రిక్షాలో ఎక్కడికో పోయాడని తెలిసింది. ఈ వార్తతో పటేల్ నిరుత్సాహ పడలేదు, తీవ్రంగా కృషిచేశాడు. నగరంలో ఉండే ౧౦౦౦౦ రిక్షావాలాల్లో హంతకుని తీసికొని పోయిన రిక్షావాడెవడో కనుక్కొన్నాడు. కైలాస్ రిక్షాలో నాంపల్లి బస్సు స్టాండు దగ్గర దిగినాడని తెలుసుకొన్నాడు. అయితే ఈ సమాచారంవల్ల ఏమీ అంతుదొరకలేదు. హంతకుడు గాలిలో అదృశ్యమైనట్లు కనిపించింది. శ్రీ పటేల్ అంతటితో ఊరుకోలేదు. కైలాస్ నాంపల్లి బస్సుస్టాండునుంచి మరొక రిక్షాలో సనత్ నగర్‌కు పోయాడని తెలుసుకొన్నాడు. హంతకుని సనత్ నగర్‌కు తీసికొనిపోయిన రిక్షావాలా ఒక కాందిశీకుడని తెలిసింది. ఈ కేసు విషయంలో ఇంతకంటె వేరే అంతు దొరకలేదు. శ్రీ పటేల్ కాందిశీకుల గుడారాలను అన్వేషించి ఈ రిక్షావాలా ఎవరో తెలుసుకొన్నాడు. రిక్షావాలా గాంధీభవన్ ప్రాంతానికి సమీపంలో నివసిస్తున్నాడు. అతన్ని ప్రశ్నించగా హంతకుడు ధూళ్‌పేటకు పోయాడని తెలిసింది. ఇంతకంటె అతనికి ఎక్కువ ఏమీ తెలియలేదు. రిక్షావాలా హంతకుని విడిచిపెట్టిన ఇల్లు కూడా చూపించలేక పోయాడు. శ్రీ పటేల్ మరికొంతమంది పోలీసులు మారువేషాలు వేసుకొని రిక్షావాలాతో పాటు ధూళ్‌పేట ప్రాంతాన్నంతా గాలించారు. అటువంటి ఆచూకీకై జాగరూకతతో అన్వేషణ చేయవలసి వచ్చింది. ఏమాత్రం పొరపాటు జరిగినా పోలీసుల ప్లానులు భగ్నమైపోయేవి. ఇల్లు ఏదో కనుక్కొన్న తరువాత పోలీసులు దానిపై దాడిచేసి కైలాస్‌ను అతని రివాల్వరుతోసహా అరెస్టు చేశారు.

ఈ ఘోర హంతకుడు లోగడ ౩౭ దొంగతనాలు చేశాడు. రిటైరు అయిన సబ్ ఇనస్పెక్టర్ శ్రీ సూఫీని హత్య చేశాడు. ఇతన్ని పట్టుకోవడంలో కష్టనష్టాలేగాక ప్రాణాపాయం కూడా. కైలాస్ చేసిన దొంగతనాలు, హత్యల విచారణ విషయంలో కూడా శ్రీ ఫ్రాంరోజ్ బొమాంజీ పటేల్ పర్యవేక్షణ చేశాడు. విచారణ ఫలితంగా హంతకునికి మరణ దండన విధించబడింది.

●

# వార్తలు - విశేషాలు

## రిజిస్టరుచేయబడిన సహకార సంఘాలు

రిజిస్టరుచేయబడిన ఏదయినా సహకార సంఘం హైద్రాబాదు సహకార సంఘాల చట్టం యొక్క నియమావళిలోని ౨౧ వ నియమాన్ని అనుసరించి ఎప్పటికప్పుడు సహకార సంఘాల రిజిస్ట్రారుచే ఏర్పాటుచేయబడే ఆడిటర్ల వర్గంనుంచి ఏ ఆడిటరు నయినా తమ అక్కౌంట్లను ఆడిట్ చేసే నిమిత్తం నియమించవచ్చును. అయితే ఈ విధంగా నియమించబడే ఆడిటర్లకు ఆడిట్ పని అప్పగించుటకు ముందు సహకార సంఘాలు, రిజిస్ట్రారు యొక్క అనుమతిని పొందడం అవసరం.

## విదేశ స్కాలర్ షిప్పులు

రాష్ట్రవిభజన కార్యక్రమం దృష్ట్యా క్రొత్తగా ఇవ్వబడే విదేశ స్కాలర్ షిప్పులను ప్రస్తుతానికి నిలిపివేయడానికి ప్రభుత్వం నిశ్చయించింది.

## పార్ట్నర్ షిప్ ఫర్ముల రిజిస్ట్రేషను

కంపెనీల రిజిస్ట్రారు స్థానంలో భారతప్రభుత్వ ఇండియన్ పార్ట్నర్ షిప్ చట్టంక్రింద పార్ట్నర్ షిప్ ఫర్ములకు రిజిస్ట్రారుగానూ, హైదరాబాదు సొసైటీల రిజిస్ట్రేషను చట్టంక్రింద సొసైటీలకు రిజిస్ట్రారుగానూ, హైదరాబాదు రాష్ట్ర వాణిజ్య పరిశ్రమలశాఖ డైరెక్టరు నియమించబడినారు.

## పింఛను పుచ్చుకోవడానికి అవకాశం

తగినన్ని సంవత్సరాలు సర్వీసు ముగించక పూర్వమే ప్రపోర్షనేటు పెన్షన్ పై స్వచ్ఛందంగా పింఛను పుచ్చుకోడానికి ప్రభుత్వోద్యోగులకు ఇవ్వబడిన అవకాశం ౧౯౫౧ మే ౨వ తేదీన రద్దుచేయబడి ఉండెను. కాని ఈ అవకాశాన్ని ౧౯౫౬ మే ౨౯ వ తేదీనుంచి మళ్ళీ కల్పించడానికి నిశ్చయించబడింది. అయితే ఎవ్వరయినా ప్రభుత్వోద్యోగి ఈ విధంగా పింఛను పుచ్చుకోవడానికి అనుమతించుటకుపూర్వం అతను పింఛను పుచ్చుకోవడంవల్ల ప్రజా శ్రేయస్సుకు ఏమీ నష్టం సంభవించదని ప్రభుత్వం ధృవపరచవలసి ఉంటుంది.

## పరిగణన

హైదరాబాదు ప్రభుత్వ సాంఘిక సేవాశాఖలో రెండవ తరగతికి అధికార్లుగాను, ఇన్‌స్పెక్టర్లుగాను, కార్యకర్తలుగాను అభ్యర్థులను నియమించడానికి లక్నో యూనివర్సిటీకి చెందిన జె. కె. ఇన్‌స్టిట్యూట్ సోషియాలజీ మరియు మానవత్వ సంబంధ శాస్త్రాలలో ఇచ్చెడి సాంఘిక పనియొక్క మాస్టర్ డిగ్రీని ఉస్మానియా యూనివర్సిటీ సోషియాలజీలో ఇచ్చెడి ఎం. ఎ. డిగ్రీతో సమానంగా పరిగణించడమయినది.

## యుద్ధ సర్టిఫికెట్లు

హైదరాబాదు ప్రభుత్వోద్యోగులలో అభ్యర్థులను నియమించడానికి మధ్యప్రదేశ్ విద్యాశాఖ డైరెక్టరుచే జారీచేయబడిన యుద్ధ సర్టిఫికెట్లను మెట్రిక్యులేషన్‌తో సమానంగా గుర్తించడమైనది.

## పరిశ్రమలకు ప్రభుత్వ సహాయం

౧౯౫౬ సంవత్సరపు లఘు మరియు కుటీర పరిశ్రమలకు హైదరాబాదు ప్రభుత్వ సహాయ చట్టం క్రింద కొన్ని పరిశ్రమలకు సహాయం ఇవ్వబడుతుంది. ఈ విధంగా సహాయం లభించిన వాటిలో, కొత్త పరిశ్రమలు, ఆ యా పరిశ్రమలు లేనటువంటి ప్రదేశాలలో నూతనంగా ప్రవేశపెట్టబడెడి పరిశ్రమలు, సుస్థాపితమైన పరిశ్రమలు ఉంటాయి.

ఈ సహాయం, క్యాష్ క్రెడిట్లనుగాని లేక ఓవర్ డ్రాఫ్టులనుగాని గ్యారంటీగా వుంచుకొని ఋణాలను ఇవ్వడం ద్వారానూ, రాష్ట్రానికిచెందిన ఒక విద్యుత్ కేంద్రంనుంచి విద్యుచ్ఛక్తిని రియాయితీ ధరలపై సరఫరా చేయడంద్వారానూ లేక అద్దె కొనుగోలు ప్రాతిపదికపై పనిముట్లను సరఫరా చేయడం ద్వారాను చేయబడుతుంది.

ఇట్టి సహాయం కొరకు వచ్చెడి దరఖాస్తులను పరిశీలించడంలో రాష్ట్ర ప్రభుత్వానికి పరిశ్రమల బోర్డు సహాయపడుతుంది.

## రాజ్య చిహ్నం

౧౯౪౦ వ సం॥పు ట్రేడ్ మార్కుల చట్టం యొక్క ౬౯ వ సెక్షనులోని నిబంధనలు మరియు ౧౯౫౦ వ సం॥పు చిహ్నాలు మరియు పేర్ల (అక్రమ ఉపయోగాల నిరోధన) చట్టపు ౩ వ సెక్షను ఇందు మూలముగా ప్రజల దృష్టికి తేబడుతున్నవి. వీటి ననుసరించి వర్తక, వాణిజ్య వ్యవహారాలలోనూ, ఉద్యోగ, వృత్తి వ్యవహారాలలోను రాజ్య చిహ్నన్ని ఉపయోగించడం నిషేధించబడింది. గణన ఫలకం పై మూడు సింహాలు, మధ్యన ధర్మ చక్రం దాని కుడి ప్రక్కన ఎద్దు, ఎడమ ప్రక్కన గుఱ్ఱం గుర్తులు గల భారత యూనియన్ రాజ్య చిహ్నన్ని భారత ప్రభుత్వానుమతి పొందిన యూనియన్ అధికార్లు మాత్రమే ఉపయోగించవలసి ఉంటుంది. అనుమతి పొందకుండా ఈ చిహ్నన్ని ఉపయోగించే వ్యక్తులు శిక్షకు పాత్రులగుదురు.

## రాష్ట్రపతి నిలయం

బొలారంలోగల రాష్ట్రపతినిలయం స్థానిక చేనేత మరియు కుటీర పరిశ్రమల వస్తువులచే అలంకరించబడింది. విద్యుత్ పరికరాలు మొదలు బంట్రోతుల మంచాల వరకూ, ఖాదీ మరియు హిమ్రూ జలతారులు మొదలు సిగరెటు బూడిద రాల్చే బరిణెల వరకూ అన్నీ స్థానికంగా ఉత్పత్తి చేయబడినవే. వీటిలో బీదరీ వస్తువులు, వెండిపూసలు, తీగెలు, నిర్మల్ పరిశ్రమ పరికరాలు మొదలగునవి కూడా కలవు. ఇవన్నీ వివిధ సహకార సంస్థలచే సరఫరా చేయబడినవి.



# BOOKS OF LASTING VALUE

**1. MAHATMA GANDHI — AN ALBUM**

(14″ × 11″ — PP. 304.)

Over 500 photographs laid out chronologically. Printed on beautiful art paper and bounded in rexine with fully printed and gold embossing — the first of its most impressive kind to be published in the country. ... ... **Rs. 35/-**

**2. PRESIDENT RAJENDRA PRASAD'S SPEECHES**

(January 1950–May 1952)

A selection arranged in chronological order. The wide range of subjects brings out Dr. Rajendra Prasad as statesman, scholar, historian, educationist, lofty idealist and reformer. ... ... ... **Rs. 7/8/-**

**3. JAWAHARLAL NEHRU'S SPEECHES**

(1949–53) **Rs. 8/8/-**

An up-to-date and authentic record of Prime Minister's Speeches.

"Perusing this book is at once an inspiring, purifying and sobering experience."

—*The Sunday Standard.*

**4. INDIA - A PICTORIAL SURVEY**

A sumptuous album arranged in ten sections, each with an introductory note; over 400 pictures depicting the story of India.

Deluxe edition **Rs. 12/8/-**

**5. KANGRA VALLEY PAINTING**

Forty works of the Kangra school have been reproduced in colour. The pictures, almost all of which are here published for the first time, are from family collections and reveal to us a world of enchanting beauty and romantic moods. The introduction to this book by Sri M. S. Randhawa gives a vivid description of the cultural background of Kangra Art. ... **Rs. 18/-**

**6. INDIA - A REFERENCE ANNUAL**

(1956)

Gives authentic information pertaining to all aspects of the Indian Union — political, economic and social ... ... ... **Rs. 7/8/-**

*Occasional Speeches and Writings (1952-56)*

*of*

**DR. S. RADHAKRISHNAN**

This volume contains the speeches and writings delivered or written on various occasions during the past four years. A valuable book by India's Vice-President and Philosopher-Statesman—Dr. Sarvepalli Radhakrishnan

**Paper Bound Rs. 3-12-0 Calico Bound Rs. 6-0-0**

**MOULANA AZAD'S SPEECHES 1947-55**

The present volume is a selection of speeches delivered by him on the various problems as they arose from time to time. **Rs. 6-8-0**

**Write for a complete catalogue. Wanted Agents in all District Head-quarters. Write for Agency terms.**

*Available From:*

**PUBLICATION SECTION**

**Department of Information and Public Relations,**

**Hyderabad-Dn. 1**

1956 జూన్ 15వ తేదీన పటన్‌చెర్వులో ముఖ్యమంత్రి యన్.వి.యఫ్. శిబిరానికి ప్రారంభోత్సవం చేశారు.
[దిగువ] సంఘ సంక్షేమశాఖ డిప్యూటీమంత్రి శ్రీ శంకర్‌దేవ్ 40 రోజులపాటు ఘానాన పర్యటన
జరిపిన సందర్భంలో ఘుమ్మేసర్‌లో ఒక బహిరంగసభలో ప్రసంగిస్తున్న దృశ్యం.



